శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

శ్రీసీతారామ వరప్రసాద లబ్ధకవితాసంపన్నులగు

పండితపెద్ది - కృష్ణస్వామికవీంద్రునిచే రచియింపఁబడిన

# బిల్హణీయము.



ఈగ్రంథము

పురాతనగ్రంథమునుఁ బట్టిపరిశీలించి

టి. చెంగల్వరాయనాయునివారి

స్వకీయ

మురహరిముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

చెన్నపట్టణము

౧౯౦౭

శ్రీరాములుసేవకులు.

# మనోహరిముద్రాక్షరశాలయందుండు నూతన

# గ్రంథముల వివరము.

ఈక్రిందనుదహరించియుండు గ్రంథములు మొత్తముగా పదిగ్రంథములుతీయువారికి కమీషనుకు బదులు ౧ వక గ్రంథము బహుమతిగా నివ్వబడును. తపాలాపోష్టుకర్చులు ప్రత్యేకమవును.

శ్రీమదాంజనేయ సహస్రనామావళి, పారాయణకు వుపయోగమగునది. ౧కి అణాలు ౩

దశావతారదండకం, శ్రీహరి లీలలు దశావతారములయొక్క వైభవములను దండకముగా రచియింపంబడినది ౧కి, అణాలు ౩

హరిశ్చంద్రచరిత్రం, కంపెనిడ్రామా వారులకు గాను మిగులశృంగారరసముగా రచించినది అ ౪

కేసరీవిలాస వచనం అ ౪

శ్రీపాండురంగసంకీర్తనములు శ్రీపండరీపుర విఠలునిపై భక్తిరస కీర్తనలు. అ ౪

పంచరత్నములు, అను అయిదుదివ్యదేశముల ప్రభావవర్ణనగల భక్తిరసకీర్తనలు. అ ౪

శ్రీవేంకటాచల విలాసపద్యావళి, శ్రీ వేంకటేశ స్తుతిరత్నావళి, శ్రీవేంకటేశ సేవామార్గము ప్రదర్శిని, అ ౧

మత్స్యశాస్త్రం. అ ౬

వేదాంతసారరత్నావళి అనుపద్యములున్ను, స[illegible]దాసునిచే కృతమగు సంకీర్తనలు } 0·4·0

ఇదిగాక ఇతర సంస్కృతాంధ్ర గ్రంథములున్ను బుుష్యాదులచేనిర్మింపంబడిన ఔషధములున్ను, గట్టిపనులుచేయబడినరబ్బరుస్టాంపులున్ను, మిక్కిలి సుందరమగు రబ్బరుఅచ్చులున్ను, అందమైన పనితనమున్ను నాణ్యముగనుచేయించియుండు జర్మనువెండినగలు మేలుబంగారు గిల్టుచెయ్యబడిననగలున్ను, శుభకార్యముల కుపయోగించువాసన ద్రవ్యములున్ను యింకా అనేక సామానులు ముద్రింపంబడియుండు మాకేటలాగులను తెప్పించిచూచి వలయువాటిని వ్రాసితెప్పించుకోవలయును, ధరలు సరసముగాయిస్తున్నాము.

టి. చెంగల్వరాయనాయుడు.

నెం ౩౬ కృష్ణప్పనాయనిగుంటవీధి.

మనోహరిముద్రాయంత్రము. చెన్నపట్టణము.

శ్రీరస్తు.

# బిల్హణీయము.

## ప్రథమాశ్వాసప్రారంభము.

శా॥ శ్రీరామావనిజానిజాయతభుజాశృంగారశాఖామిళ। త్ఫారా
కారలతాస్తనస్తబకభాస్వద్గంధవాసంకేసా। లారాళాలకభృంగరంగదఖిలాం
గాంచత్ప్రసూనోత్కర। శ్రీరామాకృతికల్పకంబును పురక్షించుఁ బుధానంద
మైౕ క॥ భవసరసిజసంభవముఖ। భువనస్థసమస్తదేవముఖ్యుల కెలమిం। బ్రవి
మలనుతి మొక్కెదను। తఱవితకుసంతతముసత్ప్రకాశముగలుగన్॥ క॥ దర
దోస్సోదకసులనిడి। గరివఁ సుగుణామృతంబుగాంచును కీర్త్యా। కరవరమా
నసపదసం। చరసత్కవిహంసముల సంస్తుతిసేతున్॥ గీ॥ నిర్మలావయవమ్మౌ
లనెమ్మినిడిచి। వ్రణములకుఁ బారుముత్తికాప్రతతిభంగి। యొప్పుఁబ్రగహింపకె
ప్పుడుఁదప్పులరయు। కాకవులలోకములనేనిరాకరింతు॥ వ॥ అనియిత్థంబున
నిష్టదేవతానుస్మరణంబును సత్కవిపురస్కరణంబునునగు కవిపురస్కరణం
బునుం గావించి యేనొక్కనాఁడెక్కువయగుపుణ్యవంబొక్క హృద్యవిద్యాన
వద్యులగు విద్వద్వరేణ్యులుఁ గొలువంగొలువుకూటంబున నధివసించి సముచితగ
తులనతులవైఖరిదీపించునవసరంబున॥ గీ॥ చిత్రకవిసంశయదుగ్ధాబ్ధిశీతభానుఁ। డను
పమానోక్తిశిశింగరార్యసూను। డమితకవితావిశేషజ్ఞుఁడనగ వెలయు। నారసిం
హార్యకవివచ్చినన్నమెచ్చి॥ క॥ శ్రీపండితపద్దసత్కృతుల। దీపకకాశ్యపసగోత్ర
దీక్షాదక్షా। భూపాలకమకుటమణీ। శ్రీపగపాదాగ్రభూమికృష్ణస్వామీ॥ సీ॥
కుత్సితకాణాదకుతర్కలకవిభేదసంశక్తయుక్తివజ్రప్రహార। ...అణకాంకపాణి
నీయాటవిపాటనచటులసూక్తివిహారపటుకుఠార। నిర్జితకృతజైమినీయతూ
లోద్ధూతసంస్కారవాక్యజంఝాసమీర। దుర్మతవేదాంతదుర్మదముచ్ఛేదభాసు
రవచఃప్రభావసార। కావ్యనాటకలసదలంకారచతుర। సాహితీమహాసమ్మ
హాసరసహృదయ। పండితోద్దీపితసంపన్నధాన। పాలితకవీంద్ర శ్రీకృష్ణపండి
తేంద్ర॥ వ॥ అనివినుతించి వినుము భవదీయంబులగు చతుర్దశవిద్యాప్రభావంబు
లు సకలభాషావిశేషంబులు సమస్తమత్ప్రియావినోదంబులు నెన్న నిన్నరులకు
దరంబుగాదు నిఖిలలోకంబులగృతిముఖంబుగాగీర్తినిత్యంబగునట్లుకృతులయం

దు నాంధ్రింబతిరమణీయంబు గావున నొక్క పురాతనకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాంకితంబు చేసి యాచంద్రతారకంబుగ సత్కీర్తిఁ గాంచుమనిన నేను సంతోషితాంతరంగుఁడనగుచు. క॥ మున్నింద్రతనూభవునకు। వెన్నుండు సహాయుఁ డయిన విధమున నేనా। సన్నుతసద్గుణగణసం। పన్నుండగు కవివరాధిప సహాయమునన్. ౧౦॥

## —షష్ఠ్యంతములు.—

క॥ శ్రీజనకసుతాహృదయస। రోజాతద్యుమణికి జవిరూపాత్తమరు। ద్రాజప్రముఖామర్త్యస। మాజాగ్రణికి నిజదాసుమరుదసిఘణికిన్. క॥ తుండీరద్రతుండనిభదో। ర్దండస్ఫుటకాండనిర్జితమహోద్దండా। ఖండలరిపుకాండునకున్। ఖండితపరశుచండకార్ముకవిఖండునకున్. క॥ సుందరపదారవిందమ। రందముదితబుధపురందరమిళిందునకున్। కుందశరతుందవ్యప। స్యందనచందనకనద్యశఃకందునకున్. క॥ వరధీధిక్కృతచక్రాం। గరథికిసౌందర్యహసితకరథికి వినమ। చ్ఛరథీకృతశరధికిదా। శరథికి ధృతశరధికి రగశాత్రవరథికిన్. క॥ శారితనయహృదయసారస। హరికి మహాసూనృతజితహరికతతేజః। పరిహాసితహరికి భవగజ। హరికి సదా పాదపంకజానతహరికిన్. క॥ శాంతునకు దాసహృదయునికి। శాంతునకు నితాంతనయనచాకోరయుగా। క్రాంతధరాజాస్యకళా। కాంతునకానందభరితకపికాంతునకున్. క॥ రావణహరణునకు జిత్వైరావణచంక్రమణునకు ధరారమణునకున్। పావనజనభరణునకున్। భావభయాభరణునకున భంగరణునకున్. క॥ రామునకు నీలమేఘ। శ్యామునకు దివాకరాన్వయాంబోధిసుధా। ధామునకు బరశురామవి। రామునకు సమస్తభూవరలలామునకున్. వ॥ అంకితంబుగా నాయొనర్పంబూనిన బిల్హణీయోపాఖ్యానంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

## —పురవర్ణన.—

గీ॥ వసుమతికి నాభిభూతమై పరలుచుట్టి। భర్మశిఖరికి నుత్తరభాగమందు। ద్రుపదలలితంబు సుజనసందోహచరిత। దివ్యదేశంబు పాంచాలదేశమమరు. అందు॥ శా॥ శ్రీరామామణి కాటపట్టు హరికి శృంగారవాసంబు జే। ల్వారత్నంబులకెల్ల నాకరము సమ్యగ్వాహినీపాళికా। ధారంబు ర్వదురాసదంబు విబుధత్రాణంబు రాజాప్తిచే। శ్రీరమ్యంబయి సింధురీతి బురి లక్ష్మీమందిరాఖ్యం దగున్. క॥ ఆపురము జయశ్రీలకు। గాపురము సమంబు ద్వారకాపురమునకున్। భూపురములలో జెల్వగు। గోపురముఖచుంబితైకగోపురమగుచున్. క॥ సతతశిరస్తలవిసదద। దితిసుతతటినీతుషారదీప్తాబ్జముతై। సుతికెక్కు సౌధరాజము। లతులితశో

పవమానతనూజునకనప్పురిలోనన్. గీ॥ కనకగోపురాగ్రఘటితగారుత్మత । రత్న
రుచులుకుముదరాజునేడి। తొడరిమేసవచ్చుచుదూర్వాంకురములని।చనుమృగేం
ద్రముఖనాములనికినులికి. సీ॥ ఒకచోటుననుబోటులొకనీటుగానిమీటువీణలనా
దంబునేడఁగాసేయ । నొకచెంగటనభంగసకలాంగయుతమంగళవ్యాదంగరవ
ము ధింధిమియనంగ । నొకవంకగతశంకనకలంకమృదుపంకజాస్యలుచెలగిలా
స్యములుసలుప । నొకచెంతవగకాంతలోగివింతగానిసంతసముమీఱసరసగీత
ములుపాడ । వెలయుబహువిధవాద్యసంవేద్యహృద్య । ఘుమఘుమార్భటిరి
క్తులగొమరుమిగుల । జనులకానందరసమునిచ్చలుజెలంగ । రంజిలావనిజా
నియారాజధాని. సీ॥ సురసాలసంతతిసురసాలసంతతిగశిఖాగ్రాళికెపలోన్నతిరెయి
సంగు। మహితకాంచనములుమహితకాంచనములపోలికనామోదములుఘటిం
చు। కలితపున్నాగముల్కలితపున్నాగముల్పట్లకొమ్మలతోడనమరియుండు । రం
భాదినటనముల్రంభాదినటనముఁకరణిమరుత్ప్రసంగముఁలఁబొందలు । పనసలెం
తయుఁబనసఫలభాతిద్విజుల । ననుపదక్రమసంయుక్తికొమరుమీఱు । నగము లు
న్నతినగములపగిదివనుల । నలరుచుండువిపత్రంబులగుచుఁబురిని. క॥ పావనము
లుద్విజసందో । హావనములతులితవృత్రహావనములుస। త్పావనములమాగి
కసం। జీవనములుకలితభువనజీవనములగున్. మ॥ కులసంరక్షణులుఁగసువా
క్సువ్రహితుల్గోత్రాహితుల్జాతవే । దులుధర్మాత్ముల భాసురాక్ష్మాభువసా
ఖ్య్రల్సజ్జగజ్జీవనుల్ । కలితార్థప్రదులాజితార్యులు కనత్తారాంతల్తమో
దూరులు। య్యాలధాత్రీసురులెంతయున్విబుధులైయుంపొందుటల్చిత్రమే॥ సీ॥
చక్రములకుఁగీడుసలుపనిరాజులుఁదివిరిసత్తముల భేదింపనియిను । కలకుభృత్తు
లకువెన్నియనికూర్మిపతులుగోత్రవగణము బల్మిఁగూల్పనింద్రు । లరికిమార్గాగ
ముగానట్టిపూరుషసింహుల వయంబుమూలనుండనివహేశు । లొకనిదాపున
జేరనోపనిశ్రీములుఁబుణ్యంబుదప్పనిపుణ్యజనులు। నారవీరనవీరసన్మైకతరులుఁ।
బరగుచురుపురిశుచిభానువంశులగుటఁ । గువలయానందసంధాయిగుణతమో
ప। హారినైపుణ్యాధులురాజన్యవిధులు. మ। ఒకశంఖంబునఁ బొంగునర్ణవ
తియుద్యోగంబుఁదామున్ భజిం । పకరత్నాకరతోటిసఖ్యమునకుంబాటించి
సంఖ్యాధిక । ప్రకటార్థార్ణవ్యతిచేఁజెలంగిబహుమిత్రప్రాభవాఖండరూ। పక
శాభూరివిభూతిఁగాంతురువుర్ వైశ్యోత్తముల్ వేమకన్. ౨౧॥ క॥ హాలపా
ణియొక్కఁడేరుం। గలవాఁడనితెల్లఁజేసికడువేడ్కఁబురిం । గలవిష్ణుపాదజావ
ళి। యలరారెసువర్ణయుక్తివ్యవసాయమునన్. చ॥ సరసిజబాంధవుండుము
మచాయననూరుఁడుచేయుఁదోలసు । స్థిరతరరత్నబద్ధవరజిహ్వాగపాశములొలి

త్సుందరీజనంబులును, జనసందోహసంపూరితవీథికారాజంబులును, రాజకుమారారూఢ సంచరద్గంధసింధురసైంధవ రథనికరంబులును, కరవిన్యస్తవీణావాదనప్రవీణ గాయకులును, గాయకయుక్తమృదంగతాళాది లాస్యసంరంభవిజృంభమాణ రంభాసమానవారకాంతలునుం, గాంతనిరంతరసురభికుసుమఫలభరితోద్యానంబులును, నుద్యానాంతరకనత్కమలకల్హారమరందపానతుందిలమిళిందఝుంకారప్రమోదమేదుర సారసహంసచక్రాది జలవిహంగ కలితసరస్సులును, సరసమనోహరపరిమళమిళితశీతలపవమానంబులునుం గలిగి, యమరావతిపథంబున విబుధగణవిభ్రాజమానంబై, తేజోవతీనగరంబు చందంబున లోహితాశ్వవిలసితంబై, సంయమనీనగరంబుపోలికను సమవర్తిధర్మరాజవిరాజితంబై, నైఋతినిలయంబుకైవడి పుణ్యజనోద్దీపితంబై, వరుణమందిరంబురీతి ఘనపుష్పమాలికాశోభితంబై పవనునిగేహంబుభాతి నానా సుగంధబంధురంబై, యలకాపురంబుచాడ్పున ధనదమహితంబై, కైలాసంబులాగున రాజశేఖరరమ్యంబై, కమలగర్భుసదనంబుపోలిక మహితభాషాసమన్వితంబై, హరినివాసంబుచాడ్పున నిత్యము క్ష్మాభిరమ్యంబై, భోగవతీపుటభేదనంబుతీరున మహాభోగిభాసురంబై, వాహినీపతిచందంబున శరణాగతభూభృజ్జాలంబై, సాకేతరాజధానివడువున రామలక్ష్మణోపశోభితంబై, ద్వారకయందంబున కృష్ణబలభద్రప్రకాశంబై, హస్తిపురవైఖరి గాంగేయాదిభూషితంబై, యింద్రప్రస్థపురంబుమాడ్కి యనఘధర్మజాతంబై, వారణాశిచాడ్కిఁ బ్రచండకాలభైరవశూలహస్తరక్షితంబై, సిరులునిరవొందుచుండు. క॥ ఆజగతికధీశ్వరుండై। రాజిలుమదనాభిరామరాజేంద్రుండజ। న్యాజితబాహాపవిధా। రాజితసమదోన్నతారిరాడ్గోత్రుండై. ౬॥ సీ॥ రమణలక్ష్మిమందిరమ్మేలమ్మగా గను సదాళిగుణమ్ము గ్రహించి। వసుధధర్మముఁ బూనిమాధవుల్ గొనియెఘుద్విజావళివాదించి। దాక్షిణ్యశాలినొద్దనెసిప్పికొనికళానిధిబర్వమునరుచిల్ నిండఁజేసి। శోభితంబుగమహాసుకృతిభావముఁగాంచి వరసత్యరతిమనోహరతమించి। కలనయందుగ్రమూర్తిఁ సంకల్పమడచి। ఘనసద్యక్ష్మాళికామానసకర్తయగుచు। నతనువిఖ్యాతిచేమదనాభిరాముఁ। డలరునిజనామగరిమ యథార్థముగను. సీ॥ బిసములోపలఁజిక్కి వెడలువానిస్వయంభులాలితవాణిఁవిలాసుఁజేసె। నాఁటివాఁడై దానమొరునివేఁడినచిరంతనమౌని మేటిభూధవుఁజేసె। నచలాధివాసునివాఁడభిక్షునిసర్వమంగళానుభవసంప్రాప్తుఁజేసె। బహుళాతిఁ ఖేదవిభ్రాంతిఁగుందు కళంకుఁ దనతోడఁగూడసత్పూతనిఁజేసె। నెన్నఁగ నీగుణమీధర్మమెందుఁగలదె। తగనముక్తులనయుక్తులుగనొనర్చు। నితనిమదనాభిరా

ఖ్యుడి నలువ। కౌశలంబుగణింపశక్యంబె చూడ॥ గీ॥ రమ్యగుణశాలి యా మహాపురందరుండు। దారగాఁగొనిలీలమందారమాల। ననుదినముఁ గూడి క్రీడలన శేముల్లి। యవనిఁబాలింపుచుఁ బుత్రకాయంబువోఁగడ॥ క॥ ఆ ఘనభూపతి దయిం చెను। హితయతగుణజాలబాలయంచితలీలం। దోయజపాయక నారద। సాయక మునభూజనాళిసన్నుతిసేయన్॥ గీ॥ నాయకులు చెల్వమైనలేఁ బ్రాయము నను। జనులకల్గా సముద్దుగా ననువుపడుచు। నాటపాటలు సలుపుచున న్నిబాల। యామినీపూర్ణతిలకసమాఖ్యవలగు॥ వ॥ అకుమారీరత్నంబు దినదిన ప్రవర్ధమానయై యున్న మెడ॥ క॥ మృగమదమున నంచిబుట్టిన। పగిదిని జెలువును బందుబండినరీతిఁ। దగసురభి పసిడినొందవిన। పగటున యౌవనముదనరె బాలామణికిన్॥ సీ॥ మహితయౌవనరూపమధుమధురాలాప బింబోష్ఠి శీవర్ణబింబకర్ణ। కంజాతదళనేత్ర కాంచననిభగాత్ర చరుచమ్పకనాసచారుహాస। పటుసైకత శ్రోణి పల్లవాంచిత పాణి ప్రౌఢసౌభాగ్యసంపన్నయోగ్య। కరికుంభకుచపాళిఘన నీలగోమాళి సుధాంశువదనకుంద్రాళిరదన। యలరె మరువంపు మొలక నాయజాని చిలుక। కలితకర్పూరతిలకసుగంధఫలక। యామినీపూర్ణతిలక నీలాంచదలక। రాజసముగుల్కు శృంగారరసము జిలుక॥ సీ॥ నలినాక్షికొప్పు కృష్ణత్వంబుఁ బ్రాపించునే మ్మోమువిధురీతి నివ్వటిల్లు। సజ్జాస్యకన్నులజ్జాకు రవహించు నధరంబు మాధవఖ్యాతి నమరు। నలివేణిచనుదోయి యచ్యుతత్వముఁ గాంచుఁ జెయ్యి పద్మాహితస్థితి భజించుఁ। దరుణాంగి నూగారు హరిలీల భరియించుఁ గౌనసంత విభూతిగరిమఁ దాల్చు। నాభిపురుషోత్తమాకృతి ప్రాభవిల్లుఁ దనువు హేమాంశుకస్ఫూర్తి దనరునిట్లు। భామయవయవగతి విష్ణుభావమొంది। వెలయుచుండు జనావళివినుతిసేయ॥ వ॥ ఇట్లు తల్లిదండ్రులకల్లారుముద్దుగా ముద్దియమే ప్రొద్దు ప్రొద్దుబుచ్చునవసరంబున॥ ౮౦॥

## విద్యాభ్యాసము.

గీ॥ అక్షరాభ్యాసమునరింపననువుపడుచు। స్వరయుతంబుగ వీణాది వాదనములు। చెలగుగీత ప్రబోధవిశేషకలన। గానసైపుణి నేర్చె సంసారరయుక్తి॥ సీ॥ రమణీయతరమైన రాయంచమ్రుచు చరణాబ్జ సంగతిని నాట్యములు సలుపఁ। జెలువమై ముద్దు గుగులుకు పలుకులతోడఁ జెంపుడు రాచిలుక పేరుగొనగ। రామాయణాదిసద్గ్రంథముల్ వెలయఁగాఁ బద్యపుస్తక రాజి పరిఢవిల్లఁ। దాళకాలక్రియోద్ఘాతతంత్రస్వరభేదంబులను పాణి విలసిల్ల। జెలఁగు చిరునవ్వు వెన్నెలల్ చిలుకుచుండఁ। గలికి తెలిడాలు చూపులుఁ గలయఁబర్వఁ। చాండిమము దోచి భారతిఖ్యాతినాతి। పసిడిగద్దియ పైఁబాటబాడుచుండె॥ క॥ ఆ పాటనవ

సుధాలహరీపటలమనోజ్ఞమాధురీలలితంబై। కోమలైనకలకంఠులయాలాపసౌక
ర్యంబుమాడ్కి-నాసైఁదోఁచెన్॥ అట్టిసమయంబున॥ క॥ మదనాభిరామభూపతి।
యొదవినసంతోషమునసమాహ్లాదముతోఁ। బొదలుచుఁగానముసేయఁగని
దవతినిజపుత్రిఁజూచి మదిఁజింతించెన్॥ గీ॥ ఈకులపవిత్రసురుచిరహేమగాత్రి।
చంద్రకళగదసంగీతజలధికిప్పుడు। దీనికినిసర్వవిద్యలుఁజేటపడఁగఁ। జెప్పసాహి
త్యమొదవఁజెప్పింతుననుచు॥ నిశ్చయించి॥ గీ॥ కొలువుకూటంబునకువచ్చికువ
లయేశుఁ। డమరసింహాసనాసీనుఁడై ప్రధానుఁ। డగువసంతాఖ్యుఁ రావించియ
ధికసంభ్రమమున సమన్వించిపలికెసమ్మతిఁజెలిర్ప॥ క॥ ఓమంత్రిశిఖామణి యిదె।
నాముద్దులకూర్మితనయనయమలరంగాఁ। గోమలగతిలయపద్ధతు। లేమారక
సరసగానమింపుగనేర్చెన్॥ గీ॥ గానవిద్యకుఁదగినట్లుకావ్యశిక్షప్పుడు। కావ్యనాటక
లసదలంకారభావ। సరససాహిత్యమేర్పడుసరణిఁగఁజుపి। ప్రౌఢఁగావింపవల
యునిరూఢమతిని॥ వ॥ అనుచున్నసమయంబునసభాసదులుత్తమలోకిట్లనిరి॥ గీ॥
కలికిపాలింపుమేలిబంగారుగిండ్లు। చానవాల్జడపులాగుచాత్రుతాపు। లతిప
వదనంబుసదనంబుజాబ్ధిసుతకు। కాంతమంగురులమ్మధుకరులకురులు॥ ఉ॥ మో
మఖిలంబుఁగన్నుఁగవముచ్చటమీఱఁగవత్తువంతయుం। గామిడిచన్నుదోయికే
సుగానుసమస్తముమిన్నుచూడఁగా। హేమమయమౌత్తనూవిభవమీరుచిరాంగికివి
ద్యనెప్పఁగా। నీమహినెవ్వఁడోపుస్తకముంచినమాత్రమెధాత్రిఁబుట్టకేఁ ౧౦॥
వ॥ అనినవినివసంతుండుభూకాంతునకిట్లనియె॥ క॥ ఓరాజసకలశాస్త్రవిశా
రదులీపురమునందుచాలాఁగలరా। చారినిటకురావించివి। నారింపఁగవలయువి
ద్యవవివింపఁగన్॥ చ॥ అనవినిసర్వశాస్త్రములయందుప్రశస్తకుతైనయార్యు
లన్। ఘనమతిబిల్వబంచినసుగౌరవముల్పచరించివారల। న్గనుగొనిపల్కె-భూ
విభుఁడవంతగుణోన్నతులారమీరలుం। డినఫలమేమియొక్క-టిఘటింపుడుమాక
నవారలత్తఱిన్॥ సీ॥ తర్క-శాస్త్రములందుదతర్కల్పనల్లయందు భాషింపగను
మహాభాష్యమందు। శబ్దశాస్త్రములందుసకలతత్వములందు। శ్రుత్యంతములయం
దుశ్రుతులయందు। తప్పదక్రమజటాంతముల నారోహావరోహములబురాణరూ
ఢియందు। స్మృతివిషయమ్ములఁజెలగుమంత్రగ్రంథములయందుతర్క-శాస్త్రము
లమఱియును। ఘనులమైవాదములప్రసంగములుచేసి। గెలిచియున్నట్టిమమ్ముఁబ్ర
సంగించి మొనఁడు। గెలుచువాఁడింటివార లేకలనుగలరు। రాజ్యరఘుపతిమదనా
భిరామనృపతి॥ వ॥ అనువినివారికిట్లనియెనాత్మమదంబునభూమిపాలుఁడో। ఘ
నమతులారమీరలిటఁగౌశలమేర్పడఁగావ్యనాటకా। భినయకవిత్వచాతురినిమాకిం
పఖిలంబుఁగనంగఁజేయుఁడీ। మనసిజరాజపుత్రికినిమద్వరపుత్రికిమంజుగాత్రికిన్॥

వ॥ అనినవిని యార్యవర్యులా రాజవర్యున కిట్లనిరి. క॥ మేమురసజ్ఞులమధిపా। కామయ్యురసజ్ఞులనంగఁ గవివరులేగా। డామాకుఁ గవిత్వము లే। దీమహాభాండవసుల బొంటు సేయుదితలంపఁగ. వ॥ అదియెట్లం టేని. సీ॥ శబ్దాపశబ్దవిచారినైయుంట్టివ్యాకరణజ్ఞుఁడనకుని గాఁదలంచు। యుక్తివాదనములచేవాప్పారుతార్కికుభ్రాంతిఁ గా బుద్ధి నేర్పడఁదలంచు। నెఱిఁగనిరాదరవృత్తిమీమాంసకుఁ గదియఁగ షండునిఁగాఁ దలంచు। నొకకొన్నైదికనిష్ఠనుండునధ్యాపకుఁ గనలిదూరస్థునిఁగాఁ దలంచు। వివిధముగనిష్టులధపకవిత్వకన్య। కావ్యనాటకలసదలంకారభావ। నవరసాభిజ్ఞు మది నిజనాయకునిఁగఁ దలఁచివరియించుఁదనుఁడా నెవలభ్రమించి. వ॥ అనిపలికినవిబుధేంద్రులకు రాజమహేంద్రుండిట్లనియె. క॥ వరనాటక కావ్యజ్ఞుఁడు । సరసుఁడలంకారవేది ఛందోనిపుణుఁ। డురుసాహిత్యకళానిధి । యరయఁగ నెవ్వఁడుపచింపుఁడతనిం దెలియఁగ. గీ॥ అనినమల్హణబిల్హణులనఁగఁ గవులు। సరసులిగువురలంకారసహితులందు। బిల్హణుండనువాఁడు గంభీరుఁడధిక । తముఁడుకవి రాజనంగస్తోత్రములువడసె.

## ——* బిల్హణకవినివర్ణించుట. *——

శా॥ ఆహా చాలతయాకవిత్వసరసంబా ప్రౌఢియా రూఢియా । భావంబాపదశబ్దగౌరవములా పాండిత్యమా శాస్త్రబో। ధావిర్భావకమా సుధారసవచోవ్యాహారమా ప్రజ్ఞయుఁ। దేవిద్వద్వ్యలభేదికైనఁ గలదే యెంచేనిఁ జింతింపఁగఁ. సీ॥ ధరణీవస్త్రములలో ధవళాంబరము మేలు బుతువులలో సుమాస్వతము మేలు। సుమములలో శరచ్ఛభిల్లిక మేలు వెలుకాంతలలో రతివిభుఁడు మేలు। ఘనసౌరభములలోఁ గస్తూరియును మేలు కలశాస్త్రములఁ గార్ముకంబు మేలు। తరుణాంకురాలలో సుందరవాక్యము మేలు సారసముఖులలో శ్యామ మేలు। పరగుపదవులలో విష్ణుపదవి మేలు। మహితగీతులలోఁ బంచమలయ మేలు। కవులలో నెల్ల బిల్హణకవియె మేలు. ౬౦॥ చ॥ మృగములలోన సింహము మహీంద్రులలో రఘురాముమహాశిఖాప। న్నగములలోన శేషుఁడువనమ్ములలో పలనందనమ్మదే। వగణములోన శంకరుఁడు వార్ధులలోన బయోబ్ధియెట్లనో। మిగులఁగ వీంద్రసంతతిని మేటియు బిల్హణుఁడెట్లు చూచినఁ. వ॥ అనినవినివారలబహూకరించి యుధాస్థానసంబులకనిచి మంత్రివరునితో నిట్లనియె.

## ——* రాజుబిల్హణకవిఁబిలుపించుట. *——

ఉ॥ ఆకవిరాజరాజమణినాదరమొప్పఁగఁ బిల్వఁబంపుమా। యాకవితాచమత్కృతివిహారముఁ జూఁతము మత్కుమారిక। శ్లోకముగాఁ గవిత్వవిధిఁ జొప్పడఁ జేయుఁగ నెంచుఁబల్కఁగా। నాకడమంత్రిసజ్జనులనంచినవారటుఁబోయియు

చ్చటన్. సీ॥ ఒకచెంత వేదాంతమూహించి ప్రకటించు నొకయోర మణిసారమొ
గిన చించు । నొకచోట వరనాటకకలాపము రచించు నొకచక్క ఘనఫక్కి నొక్కి
తెలుపు। నొకయోర శృంగారయుత కావ్యములఁజూపు నొకసీమ నురుసామమూ
ని పలుకు। నొకదండ స్వరమండలకల గానముఁ జేర్చు నొక క్రేవ బహుభాషయుక్తి
తెలుపు। నొకక్రేతల మీనమీమాంస మొక్కదారి । వ్యాకరణపాఠ మొకదెసనల
ఘులక్షణాద్యలంకారములఁ గోర్కులమరనొసఁగు। నట్టిబిల్హణుఁ గాంచిరిపా
ర్థివముదవ. వ॥ కాంచిదండప్రణామంబులాచరించి దీవనలు గైకొని సముచితా
సనంబులం గూర్చుండి కవిరాజశేఖరునుద్దేశించి. శా॥ దేవ బిల్హణపండితేంద్ర
వినుమధీంద్రాతకల్పద్రుమమా। ద్భ్రూశుంభావదనాభిరామ నృపుఁడత్యంతానుర
క్తిం బ్రీతి। మీవాంఛన్ మిము మెందోడ దెమ్మనుచు నాజ్ఞాపించె విశ్వేశ్వరుఁడీ। యీ
వేశంబని యెంచుఁబల్కఁబలికెన్ హేలాగతిన్ వారితోన్. ఉ॥ ఏమిప్రయోజనం
బుమము నేటికింబిల్వఁగ మిమ్ముఁబంచెనా। భూమివిభుండు దాత్తమతి భూతిగుణో
న్నతులార తెల్పుఁడీ । మేమటకేగుదెంచెదము మీరననేమి ప్రయోజనంబొ మా।
కేమి యెఱుంగవచ్చు మహనీయులు పూజ్యులుగారె పండితుల్.

## బిల్హణుండు రాజసభకు వెడలివచ్చుట.

వ॥ అని పల్కిన ప్రమోదాయమానాంతరంగుండై కవిపుంగవుండమితశి
ష్యసంఘంబుగొలువ రాజమార్గంబున వచ్చునెడ. ఉ॥ ఆముఖసత్కళావిభవ
మాకనుబొమ్మలదొండమావయో । ధామవిలాసమానయన తామరసాతివిశా
లదీర్ఘతరే। ఖామహిత శ్రుతిద్వయవికస్వరకుండలదీప్తగండమా। ళీమధురస్మిత
ప్రభలు లేమలు సూచిరుదంచితోన్నతిన్. గీ॥ చూచి తలయూచి తత్తనూరోచి
కాచి। తీపుసోముకాత్మ మెచ్చి యెంతే సూన । బాణబాణవిభిన్నసంభ్రాంతచి
త్తలగుచునే కాంత మునఁ గాంతలతిశయమునన్. ౨౦॥ ఉ॥ ఎవ్వఁడువీఁడు చక్ర
దనసేవన నెన్నఁడుఁ జూడ మెవ్వఁడో। పువ్విలుకాఁడొ యాధనదుపుత్రుఁడొ చం
ద్రుఁడొ యా జయంతుఁడో। యివ్వని తాళి గోమణులహృద్వనముల్ చిగురింపఁజే
యఁగ। జవ్వని యేగుదెంచిన వసంతుఁడొ చూడఁగనాకునాన్పఁడున్. మ॥ అ
తినాపువ్విలుకాఁడనింబలికె నీవజ్ఞాతుఁగంబెద్దియం । చితమాయిత్తుశరాస మెద్ది
మఱి యుంజెంతింపన వ్వారిలి। క్షితతచ్ఛుభలాంఛనంబులు పలక్షీభూతముల్ గా
వె నా। మతిసూహింపఁగ వచ్చెనో హరితగన్ మానుష్యరూపంబునన్. సీ॥ రా
కాకళాశోభి రాజబింబమటంచు వినుతి సేయఁగఁబోలు వీని మోము । ప్రత్యూష
వికసితాబ్జాతపత్రములంచు వీక్షింపఁదగు వీనివీక్షణములు। శ్రీకుమారుని హేమ
సింహాసనంబంచు వెస నెన్నఁగానగు వీనియురము। ప్రొన్నమిత స్ఫుటోద్యత్కాహి

పసిడియొంటులంటులకే వచ్చునువీనిబాహులయుగము। తుంటవిల్కాఁడు ముక్కంటికం
టిమంట। నంటినను జెడిమనుతమ్మికంటికరుణ। మగుడఁబడమికెదిగిమెనోతగన
తెంతు। సకియకాతున్నఁగలదెయీచక్కఁదనము॥ సీ॥ ఈపురుషోత్తము నెదవ
సించినప్పుడ్పకరభాగ్యమేమందుకమలనయన। యీచతురాస్యోక్తి నెలమిఁగాంచి
నశుభవాణిప్రౌఢిమఁజెప్పవశమెతరుణి। యీమేటిసర్వజ్ఞు నెనసియుండినసతి
భూతియింతంతనఁబాసగదబల। యీధామనిధిఁగూడియుఁబొందినుచ్ఛాయప
దవియెంతనిచూతుఁబద్మగంధి। వీనివెయివావనితానవమనసిజాతుఁ। గూడిక్రీడం
చునెరుణులుకోరుకెల్ల। సఫలమగువీనిసంగతిసబుపనట్టి। వెలదిజన్మంబుధాత్రీ
ణిప్రశంసకాదె॥ వ॥ అనియిట్లువితర్కించుచుండబిల్హణుండునిజాననసుధాకర
ప్రభాజాలమ్ములకుందత్రత్యజనవిలోకనసందోహమ్ములు చకోరికాబృందమ్ము
లుగాఁగనుత్తేజంబుచాఱ్పవమందగమనంబునవచ్చివిద్వజ్జనమంత్రిపురోహితా
మాత్యభృత్యగణంబులతోఁదగురాజేంద్రునివలనఁబ్రత్యుత్థానాభివందనంబు
లుగైకొనసమచితాసనంబునధివసించి యాశీర్వాదపూర్వకంబుగా వేదవే
దాంతాదిశాస్త్రంబులుపన్యసించిఫలసహితంబుగామంత్రాక్షతలొసంగి వెఱ
యుఁ॥ క॥ కవిశాస్త్రప్రసంగమెంతయు। నవిరళముగఁగొంతచేసియచ్చటవిద్వ।
త్కవివరులచేతమెచ్చులు। నవనీపతిహర్షముదవనందెనువేడ్కన్॥ క॥ గురు
కవిభాషితయుతమై। సురరాజసభాస్థలంబుచూడ్కిఁగదన్నా। వరునిసభాస్థలి
విబుధా। కరమైపరమైప్రమోదకరమైయొప్పెన్॥ అప్పుడు॥ గీ॥ రాజరాజైన
మదనాభిరాముఁడలర। తనదుకంఠస్థహారాళిఁదగనొసంగి। మఱియుమణిఖచి
తాంబరముఖ్యభూష। ణావళులొసంగివిడిదికిననిపెఁగవిని॥ వ॥ అందుమితజ
నపరివృతుండైభూవరుండుమంత్రివరునితోనిట్లనియె॥ చ॥ మరుఁడునసూవిలా
సమునమంజుతరోక్తివిశేషయుక్తిచా। తురిమగురుండునసత్కళలఁదోయజవైరి
తలంపవెంచవా। మాసమశేషణులెగనినమాత్రరాహుతిఁగ్రాగుచుండురీ। వరక
వియొద్దనుత్సవకుపాంచితవిద్యలభించు టెట్లకో॥ లా॥ గీ॥ వినుముజగతికివరక
ల్పవృక్షమితడు। వీనిలావణ్యమునియెదువిరులగుత్తి। దనరుతారుణ్యవతులచి
త్తంబులనెడు। మధుపములేఁచితిగునుసమ్మతిదలిర్ప॥ సీ॥ వీనిమనోహరానూ
నభావముఁగాంచిమేనెఱుంగకవిలాసూనశరుఁడు। వీనిభాసురకళాపర్యాప్తిఁ
గనుఁగొనిమిన్నందునెప్పుడునెమిపిధుండు। వీనిసౌందర్యాతివిభవంబుఁబరికించి
యాసిమవగలఁబూడుపాఱినుండు। వీనిసౌభాగ్యశోభితవృత్తిఁగనియుత్తరాశ
జెలంగుకత్తెసూనుఁ। డావవినికదీకైనయతఁడుఁగలఁడె। వసుధవీక్షింపదేవ
తావనితలైనఁ। దొడరిమూర్ఛిల్లుగతిఁజెందుదురుమనుష్య। కాంతలననేంత

యీతనిఁ గాంచినంత॥ అని॥ గీ॥ ఈవిధమున బల్కి నరపతి । కాశిభూధేంద్రుఁడు సుమంత్రియనియెడి నృపవ । ర్యాఁ విద్యాభ్యాసము చెలి । కేవిధమునఁ బట్టుబడుఁ గవీంద్రుఁడు లేమిన్॥ క॥ ఇతఁడు వినాగా నెవఁడీ । క్షితితలమునఁ గవివరుండు సెప్పుమా యనిన్ । మతిమంతుఁడ యీవిధమున । కతిచతురోపాయ మొకటిం గ్రహిత్స్మఁ దలఁపుమా॥ వ॥ అనిన్నృపాలుండు వల్కిన మంత్రి యిట్లనియె॥ క॥ దేవర వారికిఁ జెప్పెయని । దీవిశ్వమునందుఁ గల దెయిప్పుడటులైనన్ । సేవచియించెద వినుమీ । దేవ భవత్కరుణఁ జేతఁ దెలిసినయంతన్॥ మ॥ ఒకచిత్రవ్రతమున్న దిర్వ్వరకురాష్ట్రోత్తంససిద్ధంబుగా । సకలారకాకృతిమైన నీతనయ జాత్యంధున్విలోకింపదా । సుకవీంద్రుండునఁ గుష్ఠగాత్రి నెవ్వుడంజూడన్ మదింగోరడిం । దకునేమో వచియించు లేవే తిరిగియుండున్న నందతార్క్యమున్॥ అనివజియిట్లనియె॥ వ॥ కవిరాజాగ్రణి భట్టు గద్దుచు నీకంజాక్షికిం జెప్పియా । కవికిన్ మీసుత కష్టగాత్రియని వేడ్కం జెప్పియవార్యరికిన్ । భువినన్యోన్యవిలోకనక్రియలు నేర్పున్ మీఱఁ గాకుండున్నట్లు విచారించెదనో కర్ణ యుక్తి వినుఁడిట్లున్ రాజదేవ ప్రభా॥ క॥ ఇరువురకు నడుమ నొకతెరఁ । దిరముగఁ గట్టించి చదువు దృఢతరమతిఁజో । ప్పరణఁగ మనకన్యకనే । మరకను జదివింతమయ్య మనుజాధీశా॥ వ॥ అనినవిని సంతోషితస్వాంతుండై భూకాంతుండు॥ క॥ ఓమంత్రి మెంతవాఁడవు । నీమహిమను తింపందర మెసిర్మలగుణనీ । వేమంటి వేఁబు చెప్పితి । నామాటలయట్ల సేత మదిమేలగదా॥ అని యంతఃపురంబుఁ బ్రవేశించి॥ చ॥ జలరుహపాణి వారిధరచారుమనోహరివేణిఁ గాంచనో । జ్జ్వలరుచిగాత్రి నీలజలజాతదళాయత నేత్రి నంతిక । స్థలమునను న్నదాని సుమసాయకుమానిని బోలు నాత్మజన్ । నెలకొని కాంచి ముద్దుఁ గొని నెమ్మదలిర్పఁగఁ దండ్రి యిట్లనున్॥ ౯౦॥

## రాజుతనకొమార్తెతో బిల్హణుఁ డంధుఁడని చెప్పుట.

క॥ నాఁగర్భజలధిరత్నమ । నీగారాబంబుఁ బూడని చెప్పుదు నే । రాగంబున సాహిత్యము । బాగుగఁ జెప్పింతు నమ్మ ప్రౌఢిమ మెఱయన్॥ క॥ సంగీతవారిధికిసా । రంగధ్వజరేఖ వగుచు రాజితకవితా । సంగతిలేకఁ జెలంగుట । భంగంబుగదా తలంపభావములోనన్॥ క॥ సంగీతవిద్య కలమిన్ । సంగతి సాహిత్యవిద్య సరిగా రెండున్ । మంగళవతి కలిగినయా । సంగతిఁ జెప్పంగ దరమె సంగీతసుధీ॥ క॥ మనపట్టణమున విద్యా । భినయజ్ఞుఁడు గలఁడొకండు బిల్హణసంజ్ఞుం । డనఁగవి జాత్యంధుండా । తని చెంగటఁ జదువవలయుఁ దత్పరమతివై॥ అనినవిని॥ గీ॥ అయ్యా నేను చూడను కనిమొద్దను । జదువు కెల్ల నెటులఁ జదువుకొందు । నంధకాన

నంబు నాలోకనము సేయు। నని మహావ్రతంబు తనకుఁ గలదు॥ క॥ అంధకునిఁ దాం
శుకోగని। బాంధవదూషకుని షండుఁ బాపాత్మునిదు। ర్గంధయుతుఁ గుష్ఠివా
నీవ। సుధరదర్పింపరాదు శుభగుణవనితా॥ వ॥ అనినఁ గుమారికారత్నంబున
కుజనకుఁ డిట్లనియె॥ క॥ పట్టీ యీ లాగం బరె। యెట్టియునను విద్య నేర్పవెంతో
బాగా। గట్టిగ మీ యురువురకును। గట్టించెదఁ గాండపటముఁ గనరాకుండన్॥ వ॥
అని యొడంబడిచి మఱునాడు సముచితకృత్యంబులు దీర్చి కనకమణిమయభూష
ణాంబరభూషితుండై - కక్ష్యాంతరంబులు గడచి - మొగసాలఁ బడమి జేజేలదీవ
నలుఁ గైకొనుచు - బహువిధనివసితదేశాధీశుల మనువులు సముచితజనులవలనవి
నుచుఁ గొందఱు సుందరులు సుందరచారులై కైవారంబులు సేయఁ గొందఱు కం
జాతపాణులు మంజులగతి వింజామరలు వీవఁ గొందఱు కీరవాణులు చేరి పరాకులు
గావింప - నొక్కొక్క కర్పూరగంధి కపురంపుబాగాలొప్పు మిగులనందియ్య - నంది
యబ్రమోయ నొక్క మందయాన యందంబుగా చందనాదుల నొసంగ సంగతిను
డిగంపు చెలులిట్లు సముచితప్రకారంబునఁ గొలిచిరా నందగమనంబున వచ్చి వచ్చి
రాజితకమలాకరంబు చందంబున నొదంబగు రాజ్యలక్ష్మీలక్షితంబైన యాస్థాన
మంటపంబుఁ జొచ్చి - సమంచితకాంచనాంబుజమధ్యంబున నధివసించు రాజహం
సంబు సొంపునఁ గాంచనసింహాసనంబున - మదనాభిరామ రాజహంసంబు - వి
బుధగణపరివృతుండై మహేంద్రుండగుచు - సదానక్షత్రసమన్వితుండై కువల
యాధీశుండగుచు - మహాభోగిపరివేష్టితుండై భూభృద్వతంసుండగుచు - రా
జరాజకుమారసేవితుండై రాజశేఖరుండగుచు - సముచితభాషాసమన్వితుం
డై చతురాననుండగుచు - సుమనఃప్రసన్నుండై పుష్పసోత్తముండగుచు - నభం
గులైన వాహినీశులును - నవ్యాజబాధకులైన సుమనోవల్లభులును - నవనశా
లులయి నప్రచేతసులును - ననంతకులైన సమవర్తులును - ననుగ్రసహితులైన ధ
నాధిపతులును - నచంచలులైన మహాబలులును గొలువఁ గొలువుండి - మంత్రి
వరునితో నిట్లనియె॥ గీ॥ ఓవసంతక గూపమహావసంతుఁ। డగుకళాధిఁ బిలిపించు
మా కళాధి। వాసి ముఖికొప్పఁ బలికి తివాసి మీఱ। ననఁగఁ బిలిపించెఁ గవివరునన
ఘమతిని॥ ౧౦౨॥ క॥ వచ్చినకవిపతిఁ గనుఁగొని। విచ్చేయుమటం చనుచిత
విధులనరేంద్రుం। డచ్చుపడ నలిపి కొన్నియు। ముచ్చటలుం గడపి మఱికమునని
ట్లనియెన్॥ ఉ॥ ఓకవిరాజచంద్ర వినుమొక్కెటి సెప్పెద మత్కుమారిక। స్తోక
కళావిశేషములు చొప్పడఁ జెప్పుము లక్షలక్షణ। శ్లోకకవిత్వరూఢి కవిలోకము
సన్నుతి సేయఁ దెల్పుమా। మాకు గురూత్తముండవయి మత్కృపనత్కృతిఁ గాం
చివేసుకన్॥

### రాజు బిల్హణునితోఁ దనకూఁతురు కుష్ఠరోగిణియని చెప్పుట.

గీ॥ అయిననొక్కటికలదుమదాత్మజాత । కుష్ఠరోగంబుననుగొంతకొ
దవయయ్యె । వినయమందుమనీషావివేకమందు । గానమందుఁబ్రవీణ విజ్ఞాన
హృదయ॥ అనవుఁగవిశేఖరుండిట్లనియె॥ క॥ ఓహోబాగాయెఁగదా । యూ
హింపఁగనెట్లుఁజెప్పనోపుదువిద్యా । వ్యూహంబుకుష్ఠగాత్రని । నాహావీక్షింప
పరాదుహరివంశమణీ॥ క॥ ప్రతిమొకటికలదువాకిల । శ్రుతిహీనునిఁగుష్ఠరో
గిఁజూడనటంచున్ । మతిసంశయింపనేటికి । ధృతిమతినమ్ముఁబంపుమయ్యధీరవి
చారా॥ అనినవినిరాజేంద్రుండిట్లనియె॥ క॥ దానికినొక్కటిచెప్పెదఁ । గాని
మొదలనడుమపటముఁగట్టించెదన । జ్ఞానముఁగైకొనివిద్యా । దానముసే
యంగవలయుదాక్షిణ్యనిధీ॥ ఉ॥ అందుకుబిల్హణుండువినయంబునయంబుమనం
బునొందరా । జేంద్రునిఁజూచిపల్కెవసుధేశ్వరమీమనసట్లయుండఁగా । నిం
దులకేమియందుభవదీయవచోగతిమీఱరాదుమే । లొందఁగఁదోచినట్లసతికో
ప్పుగఁజెప్పెదవిద్యనేర్పునన్॥ వ॥ అనినవినిస్రగ్గంధకుసుమతాంబూలాదిప్రదా
నంబులసంతుష్టుఁగావించివచ్చి దరహసితవదనుండైయిష్టసఖునితోనిట్లనియె॥
గీ॥ నీయుపాయముబాగాయెనీతివేది । వనుచుభూషించితక్షణంబునసమిత్రు
కోవిదులఁబిల్వఁబంచియుకుల్లవలయేశుఁ । డనియెశుభలగ్నమీక్షింపుఁడనుచుఁ
బ్రీతి॥ వ॥ ఇట్లుముహూర్తనిర్ణయంబుఁజేసిగృహకారులరావించివివిధవిచిత్రం
బులుగావిద్యాశాలరచియింపంజేసి॥ ౧౨౮॥

### —*( విద్యారంభము. )*—

గీ॥ అపుడుమదనాభిరామనృపాగ్రకన్యఁ । దమలమైనట్టిశుభదినమం
దుపురోహితుల । బాంధవులమంత్రిహితులనఁబండితులను । గవులరావించిబి
ల్హణకవినిఁబిలిచి॥ క॥ తనసూనుతనయనధిపతి । తనరఁగరావింపవెంటఁదవిలి
సదాళుల్ । గనియామోదముననురా । సనయంబునవచ్చిపటముచాటుననిలిచెన్॥
వ॥ అప్పుడుపురోహితులుపుణ్యాహవాచనంబులాచరించియున్నతదనంతరంబ॥
గీ॥ మొదలవిఘ్నేశ్వరునివాణిబూజచేసి । బాలరామాయణమునుపద్యమొక
టి । యర్థయుక్తతనారంభమర్థిఁగఱపి । ప్రేమఁజెప్పంగదొడఁగెనాబిల్హణుం
డు॥ వ॥ అప్పుడప్పుడమిఱేఁడుసమస్తవిద్వజ్జనభూసురాదిబాంధవులకుభోజనం
బులుగావించి - మణిమయభూషణవస్త్రమాల్యానులేపనతాంబూలాదికృత్యం
బులంబరితృప్తులంజేసిమఱియును॥ మ॥ జననాథాగ్రణిపుత్రికింగవికినిష్టంబొప్ప
గాసిత్యభో । జనతాంబూలములంచితాంబరములున్నయ్యాసనస్రక్సులే । పనము
ల్తక్కువగాకయుండనమరింపన్బిల్హణుండవ్వధూ । మణికింగావ్యములాదిసేసి

కరపింపఁగ సాగెనా నాటికిన్. క॥ సరసాలంకారమనో। హరకావ్యములర్థయు
క్తిమెఱుఁగెలువొప్పం। బరఁగు సుశబ్దవిచారము । వరసాహిత్యంబు దేటపడఁగాఁ దె
ల్పెన్. గీ॥ జగతిజనములు మెచ్చియాశ్చర్యమొంద । లలితముగ బిల్హణాఖ్యుని వ
లన సకల । విద్యలు గ్రహించి జలధరవేణి యొప్పె। నంబు మించిన తప్తలోహంబు
కరణి. సీ॥ వివిధభావవిశేషనవరసంబులయందుఁ బ్రీతినలంకారభేదములను ।
ఛందోవిభేదలక్షణవృత్తముల నాటకప్రక్రియల మహాకావ్యములను । కామప్ర
దములగు కామశాస్త్రములందు జ్యోతిషశాస్త్రసంగీతశాస్త్ర । మాలాభినయక
ళాకలితమార్గములందు గణితతత్వముర కాండములను । ప్రౌఢయై సంచితశ్లో
కార్థభావమెఱిఁగి । సంస్కృతాంధ్రైకభాషాదిచతురయగుచు । హితమునీ
ఱంగ విత్వముహింపఁదొడఁగె । యామినీపూర్ణతిలక నాగతిశయముగ.

— చక్రబంధము. —

శా॥ ధన్యాసింహాభ చంద్రకీర్తి వరవిద్యాపండితార్యక్రమా । గణ్యా
గర్విధనంజయాశివదము క్ష్మా కృత్యసంగ్రహమా । జన్యారాజితఘోరిశాత్రవ
సుభృజ్ఞాతిద్రమావిక్రమా । మాన్యారాధనత్యాగభోగజయధామానవ్యభా
గ్యోత్తమా. ౧౨౦ ॥

మాలిని. కాండభూభవాసితాంశుకాండభూభవాధిరా । టాకాండ
భూభవాబ్జసుప్రకాండకాండభూవరు । తాకాండభూభవాపగోర్మికాండ
తుండిరాట్సుధా । కాండసాండుభావిభాస్వఖండకీర్తిమండలా.

గద్య. ఇతి శ్రీ సీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచిత్ర
కాశ్యపసగోత్రపవిత్ర శ్రీమత్పండి పెద్ది కృష్ణస్వామిప్రణీతంబైన బిల్హ
ణోపాఖ్యానంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

సంపూర్ణము.

బిల్హణీయము, ద్వితీయాశ్వాసము.

క. శ్రీమానితవరరఘుకుల । సోమా సోమాంతరంగసుచిరభవనో।
ద్దామవిలాసయశోవర । సీమామహనీయనామ సీతారామా. వ॥ అవధరిం
పుము తదనంతరంబు.

## వసంతకాలాభివర్ణనము.

చ॥ అలరె వసంతకాలము పురాంతికసీమవనాంతపుష్పసం । మిళితమ
రందపానభరమేదురమత్తమధువ్రతాంగనా । కలమృదుగానలోలమతికాంత

రసాలవిశాలపల్లవో। జ్జ్వలపికనాదసంచలితచారువియుక్తజనానుఖేలతైః ♦ చ॥
అని మధుమాసవేళ జలజాయతనేత్రులు క్రీడసల్పుచోఁ । గొలకులపజ్జఁ జేరినవ
కోమలకాంచనపుష్పజాలముల్ । హాలహతిక గ్రహింపఁగ సదాళులు సేయుని
రోసి పైపై గఘూ । తటమునఁ గాంచనాపహృతిఁదల్పరుగాసుమనఃప్రవర్తనల్ ♦
చ॥ చెలువసంతఘోరమణశేఖరుఁడోలిమహావనిస్థలిం । గలయఁగ నేలినైక
మెసగందగఁ గైకొనిముద్రఁబెట్టుచోఁ। వలనుగ హేమరాశిమధుపాయికిఁజూప
శవైరిజాతులన్ । మలయసుహారించుమిత్రుఁడవసుమంతునిఁ గానొనరించె నాధ్యుఁ
డై ♦ మ॥ కమలామోదసుసంఘటించిశుకవాక్యఁబద్ధినాలించియా। సుమనః
కాండము లెల్లబోధమాడెగనన్ శోభిల్లఁగాఁ జేసిని । త్యముహాఘూఞ్కబలాశభేద
నకళావ్యాపారిమైమాధవుం । డుమహింగౌరవజాతిసేఁపడవియుండున్ స
ద్విజుల్ మెచ్చఁగన్ ♦ చ॥ మనసిజచోరకుండుతరిమాటునఁ బ్రాఁజిగురాకుబాకుచే
కొని మెయిడాచి వేగఁడమిఁగొల్పి శశింబయిఁగాపువెట్టితా। నెనయఁగ ధైర్యభిత్తి
జెకలించి సమీరపుమచ్చుఁజల్లి చ। య్యన హరియించి మించె బ్రమదాంచిత మానధ
నంబులెంతయున్ ♦ చ॥ మరుఁడనుసోమయాజివనమధ్యమునందు ద్విజాళిమంత్ర
ముల్ । కరముబఠింపఁగా శిఖిప్రకాశిల గాంచి మరుద్గణంబులన్ । వరుసభజించి రా
జునకవార్యశుభోన్నతిఁ జెందఁ జేసెనా। పరమమతిన్ వియుక్తపశుబంధము మా
ధవుఁ ప్రీతిసేయుచున్ ♦ సీ॥ మాకందములనీడ మాకందములు చూడఁ జేకొమ్మరో
కొమ్మ చిగురుఁగొమ్మ । గోరంటపాయవే గోరంట రాయవే యీచాయమేచా
యం పిల్వఁ జేయు । తిలకంబు మానినీ తిలకంబుఁబూనినీ చెయ్యానవియ్యాన చెలఁగు
నాన। పున్నాగములక్రిందఁబున్నాగములఁ జెందనా సొంపురతి పెంపునందగింపు।
నిట్లు ప్రమదలుసఖులతో నెనసి మనసి । జాతదీపితహృదయలై సంతసమున । స
రసవనకేళికామహోత్సవములలర । వెలయుచుందురు మధుమాసవేళలందు ♦
సీ॥ ఘనరసాలంబుఁ గైకొని యోఁ గోకిలవాణి పదరి పోఁబోకు వే పల్లవోష్ఠి । యను
పమసరసిఁదానాగెఁ జక్రస్తని మేలనికదియ కేమినవేత్రి । చిగురించు బలుకొమ్మ
జెంతకుఁ గుంజరయాన చేరఁజూడక వె రంభోరుయుగళి । కదళికాతరువండెఁగ
ర్పూరవరగంధి కూడ కేలిడుచవతీ జకుంభ । యనుచునొకబోఁటి యదలింపనతి
వ గొనక । రామలార చంద్రాస్యలార హరిమధ్య । లారసురభిళనిశ్వాసలార
పలుకు । మానుతపియింపుడిగులొందుమాయుననియు ♦ సీ॥ బింబోష్ఠి చిలుక
లఁబిలిచి ముద్దాడంగ సాంకవగంధి మెచ్చకన గదిరె । జలరుహచరణహంసలగా
రవింపంగ ఘనవేణి రొప్పుచుఁగడకునొత్తె। గుసుమాంగి యళులఁ జేకొని తేనెలి
య్యంగఁ గాంచననాస తప్పించితరమేఁ। గిసలయపాణి కోకిలములఁ బలికింపరా

మాభిరామయూరకయనని పెఁ। బలుకులను యానముల ముంగురులను గీత। ము
లను లేఁదోఁటనరయుచు వెలదులిట్లు। మరునిబలములఁగొందఱుమరులుఁగొలుపఁ
గొంక్కఱవిజూచినిరసింతురందమలర॥ మఱియును॥ సీ॥ కలికిచిలుకలకొలికి ఫలము
లఁగొసవే కోకిలవాణిచిగుళ్లు వేవె। దీటుగానలి వేణి తేఁయల్కూర్పఁ జేపావన
చరితపుష్పములు దేవె। కలహంసగమన మేల్జలములానించవే చంద్రాజీనసుధా
రసంబుఁదేవె। పాటలాధరి వేగవీటిఘటింపవే భగ్మోపమాంగి దీపంబుఁదేవె
యనుచుఁదమలోనఁ జెలులుసయ్యాటములను। సరసవనకేళి కామమహోత్సవమున
మెఱసి। యసముశగ దేవుఁబూజింతురంద మలర। సారమధువేళఁగా సాకతీరమాల
ను॥ గీ॥ ప్రకటితాగమవాసనా ప్రథితమలయ। విమలకాసారగౌరవవిభవమంది।
లలితమైపవసంతకాలమునఁగాన। నములు చెలువొందునాకాననములకరణి॥ మ॥
సకియాకొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్సల్పెహా। లికుచంబుల్ఫలసంగ
తిక్ వెలయనాలీలాగతుల్గంటివే। సకియాకొమ్మలుపల్లవావళులతోసయ్యాట
ముల్సల్పెహా। లికుచంబుల్ఫలసంగతిక్ వెలయుటల్ చిత్రంబె యూహింపఁగన్
ఁ॥ రాగముతో సదాళితనరంబొదిసేయఁగనీలతాంగి పు। న్నాగముఁగౌగలిం
చినుమనస్థితినున్నదిచూడుమన్నహా। రాగముతోసదాళితనరంబొదిసేయఁ
గనీలతాంగిపు। న్నాగముఁగౌగలించినుమనఃస్థితినుండుటచిత్రమే చెలీ॥ సీ॥ చి
గురాకులవిమేలఁజీల్చెదరేపన ప్రియచయాశాప్తిహరింపరాదు। బిసకాండము
లమేలవిరిచెదరే హంసజీవనచ్ఛేదంబుఁజేయరాదు। మకరందముల నేలమా లెద
రేసదాళినిరాకరణవృత్తిఁ బెనుపరాదు। కువలయంబులనేలఁగూల్చెదరే ద్విజరా
జసంప్రీతినార్పంగరాద। టంచుఁగొందఱుసుందరులందమలర। వనులసరసు
లఁగ్రీడించుచునుదినంబు। సరసవాక్ప్రౌఢిఁబాపుచుఁజతురలగుచు। వెలయు
చుందురుమధుమాసవేళయందు॥ వ॥ మఱియు నవ్వసంతసమయంబునం గాంతలిం
తింతన రానిసంతసంబులసంతతతంతన్యమానతరుసంతానని తాంతకాంతంబుల
గులతాంతంబులనిరంతరపరిమళవంతంబులగుటబంతులుఁగొను తేఁటులరంతుల
కునలంతఁగొను చింతలనత్యంతసుమరసదంతురాంతరంబులగు కనకవనాంతరం
బులకరగితదనంతరంబులవంతులుమీఱ సేమంతులుగోయుచుఁబూబంతులుగట్టు
చు నెంతయు వింతలగు కంతునిచికిలివంతంబులనమంతుకెక్కిన శశికాంతరుచుల
నింతఁగొనుదొంతరలగు కలికాసంతతుల కాంతిమంతంబులై ప్రాంతంబులనలరు
నాసంతికాదంతనిశాంతంబుమంతనంబులు మెఱయురతికాంతవిజయోదంతంబుల
నుపంతంబులాడుచు గొంతదడవుతోడియింతులగికురింపుచునిగనిగనిపగడములవ
గ డెగడునొగరుతొగరుపొగరుచిగురులఁగోరక నగములకెగరుపఁగొనుమగ

కోయిలలతెగతెగలగునేగులెగయనఁగఁబడకబుగులుబుగులుగొనిమొగములసొఁగ
సుచిఱునఁగవ్రలదఁగవగునేయనుచుదఁగులమిగులనొఁగిలిసఁగమగుచుబులుగులకుసరి
గనుపడ మగుడిసరిగపనిజిలుగుసగరవ్రరయికలుబిగిబగులనిగుడిపొంకంబులగు
బిజ్జవ్రచన్నులనెలవంకలనింకకవెడలునకలంకలోహితాంకురంబులగుసచ్చిత్ర
సంకుమఁగజ్జుమపంకంబులుజారపంకజరసంబులుదొలఁజ్జుకొలంకులతేనియ్యపం
కలనిరువంకలునలంకరించులంకెలగుకంకేళివనాంగణవిటంకంబులమీనాంక ధను
ష్టంకారశంకాకరంబులై సుంకెడలినగొరవంకపల్లులకుఁగొంకుచు జంకెలజింకె
ల్పవై చూపఱకెనచూపులకలంకరత్నాంకితతాటంకరుచులలం కెలుఁగొనుకింకరీజ
నసంఘాతంబులవంకలఁదలంకకనిల్చుచు-నందదరవిందగంధతుందిలమందా
నిలసందోహంబులుకందళితకుందచందనమందారబృందాన్వితంబులై కురువింద
మణిసందీపితంబులగుకెందలిరుకావిచందువులనొందిమకరందబిందుబృందంబుల
పొందునఁజిందునందంపుకురువిందపందిరులయందునానందించునిందిందిరసందో
హంబులుసందడిరేచిగ్రందుకొనఁడెందంబులుకొందలపడనిందిరకుమందిరంబుల
గుకెందమ్ములకుందావులపందెమ్ములుజరుచుచునందఱుపిరుందులడిందగొందఱు
ముందరనరిగియిందీవరమిళిన్మిళిందముఖరితాళిందమ్ములగు కందర్పవిజయమా
కందమ్ములక్రిందపిఱుందులుచలింపనందియలుమొఱయఁ గుందనంపుసందిబొంది
యలుచ్ఛందోయినొరయఁ జిందులుద్రొక్కుచుఁగందుకకేళిం జెలుచునిట్లువిహ
రింపుచుండ, ఫలపరిపాకసౌభాగ్యసంపన్నశుకసంభాషణంబై భాగవతంబుకర
ణి - వసుమతీజాతాభిరామంబై రామాయణంబుపగిది - యారూఢహరికుమా
రబాణాసనంబై భారతంబువైఖరి - నామోదిత సుమనోవికాసంబైయిం
ద్రనగరంబుబాగున - స్నేహభూత గంధవాహంబై ధనంజయు నివాసం
బుపోలిక - చక్రాంగపాళికాసరస్ఫురితంబైదండధరునిలయంబుభాతి- శోణో
పరాగపలాశదీప్తంబై నైరృతినిశాంతంబుచందంబున- ననుగతరసవిలసితం
బైవరుణమందిరంబురీతి - సముదితగంధబంధురంబై పవననిభవనంబుకైవడి
విలసితకుందంబై రాజరాజనికేతనంబుచాడ్పునఁ - గందళితమహాఫలాభిశోభి
తంబై కైలాసంబుతీరున- జాతిరహితంబై యభేదబ్రహ్మంబుచెలువున- నఖిల
ద్విజసూక్తిగ్రాహ్యంబై మాధవునియందంబున- శుకముఖవనప్రియచయంబుల
కనిష్టఫలంబులొసఁగుచు సకలవిధకుసుమాకరంబై కుసుమాకరంబొప్పుచున్నస
మయంబున ♦

### సూర్యాస్తమయవర్ణన.

సీ॥ కరినాథుఁబట్టునక్రంబుపైవిడిచినసరసిజాక్షునిచేతిచక్రమనఁగ। వరు
ణదిక్పతికివాసవుండనురక్తిఁబంపినకెంపుపూబంతియనఁగ । నపరశైలాంత

హర్మ్యాగ్రజాలాంతరార్పితమహాదర్పణబింబమనఁగ । భువనాధిపతినిజపుర
మునబిరుదుగావలనొప్పనెత్తినధ్వజమనంగ । నభ్రసుందరిసుగుణరత్నాకరు
నకు । మేలుగలుగంగబలురతనాలుగూర్చి । పట్టిత్రిప్పెడియారతిపళ్లెమనఁగ
గ్రమ్మలుష్ణరుఁడుచరమభాగమునఁనొప్పె ॥ ఎవయఁ సత్పతియంతరీపవనునుం
డేతెంచియేమెంచునో । యనుశంకంగడుభీతిచేఖరకిరుండబ్ధింబ్రవేశించెనో । య
ననస్తాలయవాటికింజనియెనుష్ణాంశుండుతత్పీడయౌ । య్యానందస్ఫూర్తినయంచు
నకుఁవలయంబానందముంజెందఁగ ॥ ఉ॥ వారణదిగ్వధూటినిజవాటికిఁబ్రే
మనినంపురాఁగఁదా । భూరిముదంబునంబొదలిభూరిమణీగణభూషణాలికేల్గ
పారెడుపట్టుచీరెమెయినందధరించికుచద్వయంబున । న్గూరిమిఁగుంకుమంబల
దెనోయనసాంధ్యముదోఁచెనవ్వేడఁ ॥ క॥ ఇనుఁడరిగెననుచుసమయం । గన
నీలపటంబుఁదాల్చెఁగలయాశలమే । కొనియెడుజారిణికైవడి । ననఁజీకటిపుడ
మిఁజెలఁగెనతిబహుళంబై ॥ చ॥ అపరవధూటికామణికిఁనైయతిమోహముఁజెం
దిరాజుచా । కరవుశిరిగల్గుమంత్రిఘుటికాతతివిచ్చినపూలుగొన్నయం । ద
పుఁగపురంపుపూసలుముదంబునవశ్యముఁగాఁగఁబంచెనా । యపుడుసరోజ
జాండముననంతటజారులుదీరెదారకల్ ॥ చ॥ మరుఁడనుభూమిపాలునకుమాప
టివేళలదిక్పురంధ్రులుఁ । విరులునులాజలుంగలిపివేడుకసేసలుజల్లిరోయనఁ ।
సరవినభః ప్రదేశమనుసౌధముఁనందొనరించుదివ్యసుం । దరతరవజ్రపాళికల
వందగెఁజుక్కలుపిక్కటిల్లఁగన్ ॥

## చంద్రోదయాభివర్ణనము.

మ॥ కుముదంబుల్వికసింపఁగోకములుసంకోచింపఁగామిప్రజాళిమనం
బుల్దలకింపనల్దెసలుఁదెల్వింజెందిరాణింపన । క్కమలంబుల్ముకిళింపవెన్నెల
లువేడ్కన్ క్రమింటసూచింపసం । తమసంబుఁసడలింపఁజిత్తినలచిత్తంబుల్పిజృం
భింపఁగన్ ॥ చ॥ తొలిదెసకెంపునొందనయుతోల్భయమండఁబయోధిపొంగఁద ।
మ్ములుముగుడంగఁగల్వలుప్రమోదమునింపఁగవల్చలింపమి । న్నులయుఁదమిస్ర
ముంబొలయువెన్నెలప్రల్లులుఁజేరెమారుఁడ । గ్గలమయిమీఱఁజందురుఁడుకాం
తులఁజల్లుచుఁదోఁచెనెంతయున్ ॥ గీ॥ మదనుఁడిగురాకుతూపులుపదనువెట్టి ।
కళలఁదేరెడుశాణచక్రంబనంగ । దావసీసలకర్ణాంతంసమనఁగ । నుదయగి
రిఁజంద్రమండలంబుదితమయ్యె ॥

## యామినీపూర్ణతిలకయుద్యానంబునవిహరించుట.

వ॥ ఆసమయంబునయామినీపూర్ణతిలకయునగతసదాళితిలకయైప్రొద్దు
వోకనిదురరాకలేచినదైసలఁజూచిదండనుండునొక్కవేదండయానసైఁగ్గైదండ

యిడిమందగమనంబున బృందారకసుందరీసందోహంబునకుమగడునైనందననవనంబునకుందరలుపురందరారవిందవదనచందంబునందంబై యుద్యానవనసమీరణోద్యోగమ్మైచనిచనియచ్చటనచ్చపుపచ్చరాలమెచ్చుగుతిన్నెల వెన్నెలపొడలుగోరలుకొనజివురుజొంపంబులసొంపొందినమాకందంబులక్రిందకొంచెసేపువిశ్రమించితదాశ్రితవనితాజనతార్పితఫలకుసుమాద్యుపచారంబుల హర్షంబునొందియవ్వలజనిజవ్వనులబిలుచుచునవ్వనిఁగలయందిరుగుచుమంజులతరకుంజంబులరయుచునంబుయంత్రంబులుజూచుచు పాదులుగట్టిబోదులుచేసినమల్లికావల్లికాదులనవలోకింపుచునింపులుమెఱయసంపెఁగలుగోయుచుసొంపుసంపాదింపసాలంబులలోలంబులగుశాఖాజాలంబులసయ్యాటలంబులనొయ్యనొయ్యననుయ్యాలలూగుచుబాగుమీఱినవికటతటినీతటనివసితసికతాతలంబునగప్పురగందులతోడనొప్పుగకప్పురంపుతిప్పలమొగమ్ములఁగప్పివెన్నెలకుప్పలాడుచుతప్పినచప్పటులప్పళింపుచునొకరొకరింగికురింపుచునాటలఁబాటలఁబూఁదోటల నిట్లువిహరింపుచుండగడ॥ అలివేణిరో మనకామోదంబులుఁ। గలయఁజేయుచుఁగలనాదంబులు। పెంపుదలిర్పఁగఁబికవారంబులు। గుంపులుఁగొనిపల్కుచుఁగీరంబులు। జాలగుతేఁటులఝుంకారంబులు। నోలిగశారీహుంకారంబులు। పరగఁగనొప్పడుపాటీరంబులు। మెరయుచునుండెడుపాటీరంబులు। నడరునెపుడుఁగుసుమాసారంబులుఁ। గపువడిఁబోకురేకాసారంబులు। గలిగినచోటికిగదలేడితావులు। గలిగినజాలునుగపురపుదీవులు। చూడగరమొంతోసొంపైయున్నది। పోడిమిఁజెప్పకుపూర్వమెకన్నది। కంటేతరుకువగలదావాటికి। యంటివెపోదమయావనవాటికి। పదవేపోదముపదుగురమిప్పుడు। పదరకపోవలెబలుకాల్చప్పుడు। విసినపెగడిపోవేరాయంచలు। పనివడిసేర్పెర్పడగాఁజంచులు। చాటుఁజేసుకొనిచనరేయింతులు। మాటలాడకురేవతిమీరంతులు। మొకరాడవచ్చినసేమనమీరలు। వెకరాగమాడితివేసఖివారలు। సేయఁగనన్ననజెలువేసీకను। పోయెదనుండవెపొలతిరోనాకను। పనియేమున్నదిపలుకేమంచిది। మనలేదానిమాటలసంచిది। తేటగమనమీతేసియవంకలు। దాటగదరమేతలపునశంకలు। మానరెచూచినమంచిదివెన్నెల। కానికానిమతికనురపుందిన్నెల। తరువులనీడలదాగిరిమాతలు। పరగనాడుదముపదుగురునాతులు। రారేనసీరవణిసముట్టితి। గోరికమీఱఁగఁగొమ్మనుఁబట్టితి। బంతులాడుదమువంతులుఁగట్టుక। చెంతకురమ్మిఁచెలిఁజేపట్టుక। పువ్వులుగోయుదమివ్వనితావుల। దవ్వాపోదముతనరెడుతావుల। కీమ్మైయున్నావిదిగోపువ్వులు। నిమ్మహిరాలినసేరవెపువ్వులు। గాడిగవెన్నలగాయఁగఁదరువుల। నీడలపాడవెన్నలవీయిరువుల। నేతెంతెమువచియుందరువేడుక। నాతతకేళులనందఁగూడుక। నాడుదుఁబాడు

చూనను గతవనమున| వేడుక చేసిరి వెలదులు ఘనమున♦ క॥ అందలసి సొలసి రాజపు|
రందరకన్యాలలామరమణులు వేడ్కం| జెందియుపచారములు సే| యం దగశయ్య
నించె మనముక్కృతాంచితశయ్యన్♦ గీ॥ అట్లు శయనించి కూరుకు నందియుండ| నంతలో
లేఖ్యవివర్తాత్మమైక లంగి| తెలిసి కనుమూసి క్రమ్మఱం జెలిమిం గాంచి| కాంచి [illegible]
లు చెలులను గాంచి కాంచి♦ గీ॥ మగుడ శయనించి మఱి లేచి మయివిదిర్చి| మగునిం దల
పోసి తలపోసి మరుని గాసిం| కినిభరింపంగ లేక నూర్పెనయంజికిం| పలుకనేకయు
న్నప్పుడతులెల్ల♦ వ॥ క॥ ఇది యేమి వింత యిచ్చట| నిదురించెను లేచి లేచి నెఱి మన
ములం బూడదు మాటలాడ దెంతయు| నిది యేమో తెలియ నేర మేమందమ్మా♦ వ॥
అని యిట్లు తమలోం దాము వితర్కించి చుట్టుముట్టి రాపట్టి పట్టుంబట్టి యట్టి వాని
మొగంబుం గనుంగొని యొక్కసఖి యిట్లని యె♦ క॥ ఓయమ్మ యేమి యిది నీకీ మొడము
ముం జూచి పల్కవేమి యిప్పుడున్| డాయవు కారణమేమీ| పాయని దయతోడం జూ
చి పల్కుము కలికీ♦ చ॥ అనవిని చాలం దెప్పిరిలి యాసఖిం గన్గొని పల్కె నోసఖీ| విను
ము కవింత యేమని భువిన్ వచియించెద నైనం జెప్పెదన్| వనిం జరియించి యిచ్చటికి
వచ్చి మదంబునం బువ్వు సెజ్జ నిం| పునశయనించియుండు తఱిం బొందుగం గూర్కిడి
నంతలో పలన్♦ చ॥ ఒకకలం గంటిం గంటి ఘను నొక్కని చక్కెర వింటి వాని పో| లికం
దనరారు వాని నమలీమస కాంతులనొప్పువాని నం| వికసిత సారసాక్షుమతి విన్నది
గన్నది గాన మెవ్వండో| సకియిటు వచ్చి నా సరస జాణతనమ్మున నం దెనుండిక్కన్♦
ఉ॥ నేను నువాని పేరడుగ నేరక మారకఠోర కార్ముక| జ్యానినదంబు సోకి తమినంది
చెవుడ్డ డి చూచుచుండ వాం| డూని సప్రేమ దివ్యఫల మొక్కటి యిచ్చి యదృశ్యుండ
య్యెం జం| ద్రాననచంద్రుం డజ్జలధరాంతర మొందినరీతి నంతటన్♦ ఉ॥ తత్తర పా
టుం జెంది మది తల్లడిలంగ నుమేలుకొంటి నా| చిత్తజ సన్నిభాంగుం డెటం జెందెనో
నన్నిటం గ్రూరుండైన యా| చిత్తజు బారినింబడంగం జేసెను కందమిం దాళం జాల నే| ని
నిత్తఱిం బల్కవమ్మ దయనిందున కేమి యొనర్తు భామినీ♦ వ॥ అనిన శుకవాణి యిట్ల
నియె♦ ఉ॥ ఈకలమంచిదమ్మ మదినిందుకు సంశయమొందకమ్మ యా| శ్రీకర గాత్రు
దర్శనము చేకురు నమ్మశుభావహంబుసు| శ్రీకరమైన పండు సుతసిద్ధియు నొగదవ
మ్మ నేలు మే| లీకల మూకు సమ్మదము హెచ్చెంగదమ్మ సుధాకరానన♦ వ॥ అనియి
ట్లు బలుకుచున్న సమయంబున♦ సీ॥ మలయాగములజారి వలయాగముల దూరి కల
యాపగలం జేరి పాలుపు మీఱి| ఘనసారసమములొంది ఘనసారములం జెంది మనసాల
జెలువంది తనివిం బొంది| మల్లికానవహేమవల్లికా సుమనోమతల్లికాయుతసీమనల్లి
కగని| కేళికారతిలోలబాలికా సుకపోలపాలికా సమలీల మేలుగాంచి| శారికాకీర
పరభృత చంచరీక| కలితకలకలనినదసంకలితచలిత| విరహిజన మానసాంభోజవీ

ధీయాగుచు। గలయునే తెంచెశీతలగంధవహుఁడు॥ అట్టిసమయంబున॥ శా॥ రాకాశీత
మయూఖజాలములు మేరల్ మీఱి మైనిండను। ద్రేకాంభోజశరాశుగావళులులోఁ
ద్రిప్పారఁ బాటీరశై। లైకాంచత్పవనంబు పైపయిఁ గడున్ హెచ్చై విజృంభింప
మహోద్రేకం జెందిసహింపఁ జాలక తమింగా సిల్లి మూర్ఛిల్లినన్॥ ౪౦॥ వ॥ అచ్చట
నున్న సఖ్యాలీసందోహంబు లాహాకారంబునొంది॥ ఉ॥ ఇప్పని కేలవచ్చితిమి యిం
దఱుము గ్గుమిగూడి వచ్చియు। పువ్వులతోఁట నేలసొరఁ బూనితిమిప్పుడు పూనియు
చ్చటం। గ్రొవ్వున నేలనిల్చితిమి గొబ్బునఁ బోక యటంచు మించు బోం। డ్లవ్వనజాక్షిఁ
జూచుచును హాయనుచున్ మదిసంభ్రమించుచున్॥ చ॥ కలగనువారలుం గలరు కల్గి
న యాకలవంటి దెక్కడం। గలుగును గల్గనివ్విధము గాసిలుచుండెడికాంత లెక్క
డం। గలవు వధూటులార యిఁక గార్యము మీఁద వచింపరమ్మ యీ। చెలిఁ గటనుంచఁ
గాఁదగదు చేరుదమింటికి వేగ బాగునన్॥ వ॥ అనియిట్లు చితంబుగా శైత్యోపచారం
బులు సలిపి సేదఁదేర్చి యా రాజపుత్త్రిఁ దోడ్కొనిపోయిన నాలోన॥

## కవిచంద్రుండు చంద్రుని నిర్జించుట,

సీ॥ సాంధ్యకృత్యములెల్ల సలిపి యుష్టుఁడైన యీశ్వరునకు నమస్కృతు
లొనర్చి। భుజియించి తావులఁ బొలుపైన చందనమలది పువ్వులు దాల్చి హారరా
జి। భరియించి పలువలు ధరియించి తాంబూలము సేయుచును వచ్చి మోదమం
ది। శయ్యపైఁ శయనించి చంద్రుని వేడుకఁ బరికించి వీక్షించి భావమలర। నింపుమె
యి బిల్లాణుండు వర్ణింపఁదొడఁగె। నిదియు విరహిణులకుఁ జూడఁ మదనతాప
ముదఁబొడవఁ జేయువిత్తనం బెన్నమఱియు। మరునకు బలంబు వరచంద్రమండ
లంబు॥ వ॥ అనిమరియు నిట్లని యెంచ॥ చ॥ కలువల నిద్ర లేపి రతికాంతుని సౌంద్యము
వాపి పుష్కర। స్థలిఁదిమిరంబు జోపి రతిఁ జాలని బాలలనూపి దేవతా। వలికమృ
తంబుఁ జేపి యలవాసవ దిక్సతికుండలంబునై। కలువల ఱేనిమండలము కాంతిలుచు
న్నది తూర్పుకొండపైన్॥ చ॥ జలనిధి పంకమంచు మహిచ్ఛాయయుఁ జిహ్నము లేడిపి
ల్లకం। దళితసురేంద్రనీలమణిధామమటంచు వచింతురందఱీ। కలువలఱేని
యందుఁ గలకందును నేననుకొందు రాత్రియం। దలవడ మ్రింగినట్టి తమమంతర సం
స్థమటంచు నెంతయున్॥ ఉ॥ చందురుఁడన్న్య గాధిపతి శౌర్యవిజృంభణవృత్తిఁ
బూని ప్రారంభర దిగ్ధరేంద్రకుహరంబున నుండి రుచుల్ నెలంగఁగా। మందల కేగు
దెంచుచుఁ దమఃకరికుంభము స్వాంశు రేఖికా। బృందనఖంబులం జదుపవీడిన ముత్య
ములట్లు దారకల్॥ సీ॥ ఈకళానిధివల్ల నేకదా దిక్కుదిక్కుల వారలెల్లను దె
లిసిఁ గనుట। యీవసుఖనివల్ల నేకదా విబుధులు కోరికల్ దీరంగఁ గుడుచుఁ గనుట।
యీమహానిధువల్ల నేకదా సభ్యులెన్న్యఁగ నిశాచరులెల్ల దిగులుగనుట। యీస

త్రుభునివల్లనే కదా మోదించి కువలయం బెచ్చుగాఁ గూర్మిగనుట । నవురయీ
రాజు మహిమయే మనఁగవచ్చుఁ। దమము వారించి యరుల సంతతి నడంచి। యున్నర
తిడింబి హరిపదమాశ్రయించి యు। దయగిరి దుర్గమునుండి యొప్పుచుండె॥ ఉ॥ ఈ
రోహ్మదమ్రాద్రి రాజతగిరీశ్వరమీ సితభానుఁ డెన్నఁడా । దాక్షాయణి నేలు శంకరుఁడు
కప్పగళచ్ఛవి దాపుచుకర్లై । నాయకమూర్తి యీ ప్రమథనాథులదక్కి నచు
కర్లుబిన్నహా । శ్రేయము సంగుస్వప్రరుచిఁ జెంది భజించు వియోగపాళిగన్॥ సీ॥
ద్విజరాజటంచు భావించుటయే కాని రూఢిగా దోషాకరుండు వీఁడు । సన్మార్గగ
తుఁడంచు జనులు పల్కుటె కాని దండిమీఱి వనిగాటుండు వీఁడు । సమృతకరుండర్థి
చునాఖ్యమాత్రమె కాని చర్చింపఁగా విషజనుఁడు వీఁడు। కువలయప్రియుఁడంచుఁ
గోరి సెప్పుటె కాని పాడిదప్పిన చక్రవైరి వీఁడు । తమము వారించు రాజను క్రమమె
కాని । యేపుమీఱు అంగనాకుల నేచువీఁడు । ననుచుఁ గులటలు దూషింతురనుచు జ
నుల। త్రోవరా వెఱచినో నీవు తోయజారి♦ క॥ సురల తెరువు వోసాగితి। వరయఁగ
సత్పతిప దేవిశాటుఁడవానీ। కిరవొందఁగ విధునామము। హరిహరితేజఃపంకఁ జెల్లు
నా కమలారీ♦ క॥ కమలంబున జననంబయి। కమలాసనుఁడనఁగఁ బరఁగి కరకరమతి
చే దమియింతు రేవియోగులు। క్రమమున నావిడిచి మలిన గర్భుండంచున్ ॥ చ॥ హరి
కబళెం మటల్ హరునకంబకమౌటఁ దమిస్రయందుఁ దేజరిలుట నీటఁ బుట్టుట నుభా
యలు గాంచుట మేచు బెంచుటల్। ధరణిధరంబు నెక్కుటచు దగ్గుట మిన్నులు ముట్టివ
చ్చుటల్। గరకరిఁ బాంధకోటులను గాల్చుట నగ్గ్రవిసిద్ధ మేశశీ♦ సీ॥ ఓరి మాయసు
రేల పోసుకొనెదవు రాతోరంపు నీమేను దోఁడిఁబోను। చెలఁగి రాపేల చేసెదవు రా
ఖేచర పాళినీకండలు పంచుకతిన। యీలీల మము గాసి మేల పెట్టెదవు రా పర్వంబు
లను నిన్ను పాముగరవ। క్రోధించి మమ్మింత వేధించ నేల రాకాలారి విసరిని న్నేలఁ
గొట్టు నను చుఁబాంధులు నిందింతురందువలన। లబ్ధిబవేశించెనో యీ కళంకమొక
టి। గాక యుండిన శుచిమూర్తిఁ గాంచునీకు। మలిన తావృత్తి గలుగు నే జలజవైరి♦
సీ॥ పొంచి మొంత యుఁదోఁడఁ బుట్టిన దానిల్లు కంపవెట్టిన మహాఖలుఁడు వీఁడు। చలప
ట్టి వెసని శాచరవృత్తి నిసదాళి తేజంబులడఁచు నిందితుఁడు వీఁడు। కలఁగి ఘోషింపఁ
గాఁగన్నతండ్రినిఁ బట్టి భంగపెట్టిన ఘోర పాపి వీఁడు । మెఱసి యాపయి నున్నమి
త్రుని విభవంబుఁ జూడఁ జాలని నికృష్టుండు వీఁడ। టంచు భువిలోన విరహిణులాడుకొ
నఁగ। సిగ్గు దోపక మున్నంది చెలువు రుఱుఁ। దిరుగుచున్నాఁడ విపుడింత తెలివిలేక। తా
ళు వెన్నెల చీకట్లు ధవళకిరణ♦ సీ॥ మేర దప్పనివాఁడు మేదినీతండ్రి నిత్యజీవనవృత్తి
నిదు తల్లి। యిష్టసంపద లెల్లనిచ్చు నీతోఁ బుట్టు నెమ్మి శ్రీగలవాఁడు నీదు బావ। వరసు
మనోధర్మపరుఁడు నీయల్లుఁడు నిర్మలచిత్త నీ ధర్మపత్ని। చక్రపాలన కళాశాలి నీమి

ప్రచండవిబుధులపాలిటనీవితరణంబు । తమమువారించునీదుసందర్శనంబు । నిఖిలజనులకు మోదంబునీదుమూర్తి । యిట్టిసంపదగలుగునీయట్టిరాజు । కోరిచూచినఁగలఁడెయోకువలయేశ ♦ వ॥ అనియిట్లుబిల్హణుండుచంద్రునింబేర్కొనిబహుప్రకారంబులవర్ణింపుచున్నయెడ ♦ గీ॥ భోజనముసేసికొప్పునఁబూలుఁదురిమి । చందనములందిదాంబూలమందివేడ్కఁ । బొలుపుగావచ్చియామినీపూర్ణతిలక । యవనికాభ్యంతరమునశయ్యనువసించె ♦ ఉ॥ ఆకడనాకవిక్షితివరాధిపుఁడెందునీగూర్చినేర్పునన్ । వారొనితద్విశేషములువర్ణనసేయఁగనాలకించుచో దేవరవిస్మయాంబునిధిఁదేలిమనంబలరంగశంకచేఁ । గోకిలవాణియిట్లుమెుఁగూరిమితోఁదనలోననేర్పునన్ ♦ ౨౦॥

## —❧ రాజకన్యకకవిరచించుచంద్రవర్ణనవినియాలోచించుట. ❧—

క॥ తమజనకుండీసత్కవి । నమరఁగజాత్యంధుఁడనుచునాదివచించెం । గ్రమమొప్పఁజంద్రవర్ణన । సుమహితముగఁజేయఁదోడఁగఁజూచినకరణిన్ ♦ శా॥ అంధుండెక్కడచంద్రుఁడెక్కడతదీయంబైనయవ్వర్ణనా । బంధంబెక్కడనిట్టివింతగలదేభావింపనెచ్చోటనై । సంధాత్రీంద్రుఁడుమాకునిర్వ్యపకునందంబొప్పనవ్యోక్త్యూహ్య । త్సంధానంబగునంచుఁజేసెనిటులంజర్చింపవేరున్నదే ♦ అనిమఱియును॥ క॥ వ్రతభంగమయినగానీ । మతిమంతుఁనుదాత్తవేషుఁమానితవిద్యా । న్వితుఁనింగాంచెదఁగన్నుల । కతులమహోత్సవముగాఁగయనిచెలిప్రీతిన్ ♦

## —❧ కన్యకకవినిఁజూచిమూర్ఛిల్లుట. ❧—

సీ ॥ వినుతవిద్యాజితద్విజరాజుద్విజరాజురుచిరాజితగుమోముఁరుచులవాని । రమణీయవాణిభారతికాంతురతికాంతుఁనతికాంతిఁదెగడుసోయగమువాని । నతులితశుచివిభాహరిమిత్రుహరిమిత్రువరమైత్రిగల్గువైభవమువాని । కలితతేజోల్లసత్కమలాప్తుఁగమలాప్తుఁగమలాప్తిమెఱయుచందములవాని । సకియమదినెంచితమిమించిసంభ్రమించి । చేతులఁగరించితెలివంచిచెలువునించి । పొంచితిలకించిపులకించిపొలుపుఁగాంచి । కాంచెరోహిణిచంద్రునిఁగాచినట్లు ♦ క॥ కాంచినయంతనెసతిపుల । కాంచితదంతురితదేహయైనిశితోద్య । త్పంచశరశరవిపాటన । సంచలితస్వాంతయైవేసన్ధృతిదూలన్ ♦ గీ ॥ పరవశమునొంది మూర్ఛానుభావయగుచుఁ । బవనచాలననిపతితవల్లిమాడ్కిఁ । బంకజాయతలోచనఁబడియెమఱియుఁ । బట్టుదప్పినకనకపుఁబ్రతిమఁబోలి ♦ ఉ ॥ ఆకడబిల్హణాఖ్యకవియత్తఱిఁదామరసారిఁగూర్చియెం । తో కరముప్పతిల్లినుతులొప్పవిరింపుచునుండియంతలోఁ । బ్రాకటబద్ధకాండపటిపైరమణీమణిమోముఁజూచియు । స్తోకమహానయాశ్రిపయిఁదోచినచంద్రునిఁబోల్చియిట్లనున్ ♦

— బిల్హణుండా కాంతముఖాద్యంగంబుల వర్ణించుట. —

సీ॥ రాకేందుబింబమో రాజీవమో మించుటద్దమో లేక నెమ్మొద్దు మొగ
ము। వెలుపొందుకల్వలో చేపలో సురుని నారాచంబులో లేక లోచనములో।
కోకంబులో విరిగుత్తులో బంగారుకుండలో లేక వక్షోరుహములో। సౌ[illegible]ని
యొయ్యనక్షత్రమో నాసుస్మైడెతీగయో లేక సతీతిలకమొ। యారయీకళయీతావి
యీరమణత। యీవిధంబునుయీ బెళుకుయీకుశలత। యీసువృత్తయీ
సొంపుయీమెఱుంగు। యీతళుకునిగ్గుయీచాయ యెందుఁగలదు॥ హరిణ.
విముక్తశీతాంశుబింబముగానిపురుడింపఁగానిదిముఖముగాదు। ఘనసువర్
ణకాంచనకుంభములుగానిచర్చింపనివియురోజములుగావు। పంచశిలీముఖ
బాణపఙ్క్తులుగానినలువాప్పనివివీక్షణములుగావు। చెలువొందుయువజనశృం
ఖలంబులుగాసిగురిమీఱనివియుముంగురులుగావు। డాలుమించినమించుటద్దా
లుగాని। గణుతిగొననివిగండభాగములుగావు। సోయగంబైనబంధూకసుమ
ముగాని। భావముననెన్నఁగానిదిమోవిగాదు॥ మ॥ తిలకిస్సునే శశిరేఖయిల్లుఁ
గలువల్గందమ్మిరేకబ్జముల్। లతికల్గుంభములాకసంబిసుకడిన్నల్రంభలంగాహ
ళుల్। శతపత్రంబులుభావలీలఁగొనియాచంద్రాస్యఫాలాక్షుని। ర్జితదేహుఁ
శుకరాజవాహుమొలిపించెన్మేనఁజిత్రంబుగన్॥ మ॥ ఉరుపక్షోజయుగాంతర
స్థమయినాయుల్లంబురాగేమిత। ద్భరసంఘృష్టినశించెనో విరహసంతాపాగ్ని
చేఁద్రాఁగెనో। స్థిరలావణ్యసుధాసరోవరసదాప్తిస్మగ్నెనోకామత। సకర
వీరుంమహరించెనోనవవయః కాంతారసంచారుఁడై॥ ద॥ అనిమఱియునిట్లనియె॥

సీ॥ ఈభామతనుకాంతినేపారఁజూచిన హేమాభిధానంబునెంచనేల। నీచాన
యూరుప్రభాచాకచక్యంబురంభాభిరూఖ్యఁబురహీనడంచు। నీరామనవ్యానా
సారమ్యలీలతిలోత్తమాఖ్యనుదలనెత్తనీయ। దీకొమ్మకన్నులనిరవొందుబెళుకు
లుహరిణీవిలాసంబునపహసించు। నిటులఁగాత్రైకదేశమునటమటించు। సౌ
రవారవఘూటికాసామ్యకలన। మనుజలోకంబునందుండుమానవతుల। నంగ
నెంతయుదీనమానంగవశమె॥ సీ॥ చెలియపెన్నెఱిగుంపుఁజేపట్టఁగలిగెనాఘ
నసంపదలువేడ్కఁగాంచినట్లు। కాంతమోమునమోముఁగదియింపఁగలిగెనా
యతులితరాజత్వమందినట్లు। ముద్దియకవ్వోయిముద్దాడఁగల్గెనాయింద్రుమైక
వలయంబేలినట్లు। వనితకంఠాశ్లేషమొనరింపఁగల్గెనాయారుధారుఁజెన్నిధియ
బ్బినట్లు। కలికికెమ్మోవిచవిజూడఁగలిగెనేని। యెదుసుదాహారవైభవంబొందిన
ట్లు। నెలఁతతోఁగూడిక్రీడింపఁగలిగెనేని। యతనుసామ్రాజ్యమంతయుసమరిన
ట్లు॥ ఉ॥ అందఁపుగొనుక్రీహగినహానిఁశమూఁభజియించితత్పదం। బందనటం

చుఁ జన్నవత దాకృతిఁ గాంచె గిరీశుఁ గోరియా। రుం దగఁ జూచి వెంటఁబడి యాఢికి
నెకుటనెట్లటంచుఁ దాఁ । జెం దెవహీనవృత్తిసుని శేషతనిర్వ్యరసుం బ్రియంబు
గాఁ గన్‌॥ చ॥ వనజమహావిభూతిహరి వైఖరిఁ గాంచుఁబద స్తవోత్తములున్ । తనజమ
హావిభూతిహరి వైఖరి మించు గళోరు వేణికల్ । వనజమహావిభూతిహరి వైఖరి
దూఱుఁ గరాక్షిమధ్యముల్ । వనజమహావిభూతిహరి వైఖరి మీఱు పృథ్వాస్యయా
నముల్॥ సీ॥ ఈభామ వదనాబ్జ మెలమిఁ గాంచినయంత విధుని సంభావించి వెలసి
నట్టు । లీచాన నెఱికురు లెనసి పట్టినయంత నీలకంధర సేవ నెగడినట్టు । లీయంబు
జాక్షోష్ఠ యిమ్ముద్దిడున౦తఁ గమలజసద్భూతి గలిగినట్టు। లీరామ కెమ్మోవి యిం
పారవంటినన రుణబింబాలోకమమరినట్టు । లపురతనకింతకంటె భాగ్యంబుగల
దె । యితను మంత్రాధిదేవతయనఁగ వచ్చు । నీచెలిసిఁ బొందఁగోరెఁ గాలి దేరుఁ
గాక । వేరె మఱిఁ బూని తపముఁ గావింప నేల॥ సీ॥ సారంగములమీరు సారంగ
ములగేరుఁ దొయ్యలికొప్పు కన్దోయి యొప్పు। పున్నాగములనెంచుఁ బున్నాగము
లనొంచు నలివాస్య గతిసొంపు నాభిపెంపు। చంద్రఖండము నేలుఁ జంద్రఖండముఁ
బోలు సుదతి చెక్కులబాగు నుదుటిలాగు । కాంచనంబు హసించు గాంచనంబున
డంచు తరళలోచన వాసతను విలాస । మవురయీ ముద్దుచెలిఁ బొందినట్టివాని ।
భాగ్యమెన్నంగ వశమె యాపద్మభవుఁడు । దీని సృజియించు వేళ వాగ్దేవి నెదుట ।
నుంచుకొని చేసెఁ గాబోలు నొందుగలదె॥ ఉ॥ దీనిముఖాంబుజంబు గణుతింపఁగ
శ్రీనిధి యొక్కకోణమం । దూని వసించుఁ గాక నయనోద్ధతి వాక్యసకల్పలోకకు
చోద్యమానుగ నిల్చుఁ గాక మృదుమంజులవాగ్ధతిఁ జెప్ప వల్లకీ । స్థానమటుండు గా
కమి నుచాయకుద్రము కెక్కుదమధ్యమెన్నఁగన్॥ సీ॥ ఊహించి పున్నమయొక్క ప్రౌ
ఢ్దుండునో ముద్దియ నెమ్మోము ముద్దులాడఁ । దనరాజసత్ఫలదానంబు సేతునో
నెలఁత కెమ్మోవి తేనియలు గ్రోల । బంగరుకలశముల్‌ బరగఁ బూజింతునో పడఁతి
చన్గుబ్బలు పట్టి చూడఁ । జెలువొందభూప్రదక్షిణము గావింతునో యతివకటిస్థ
లి సదివసింప। నిట్లు గాకున్నఁ గల్గునే యింతిపొందు । సంగతులటంచుఁ దమిమీఱ నం
గజాత । జాతతాపాతిశయమునసతినిమతిని । మమతఁ బెనఁగొనివర్ణించుచు నతి
యుమ్మఱియు॥ సీ॥ పొలతిపాదములతోఁ బొందు సేయఁదలంచి తామరల్‌ పరికించి
తమ్ములయ్యెఁ । గలికి పాలిండ్లతోఁ జెలిమి సల్పఁగఁ గోరి భావించి చక్రముల్‌ పక్షు
లయ్యె । సుదతి కెమ్మోవితో జోడుగూడఁగఁ బూని చెలఁగి మంకెనబంధుజీవమ
య్యె। హరిణాక్షి నెమ్మోము నాశ్రయింపఁగఁ జూచి మిహిరాంశుఁ డెలమి సస్మి
త్రుఁడయ్యెఁ। జంద్రముఖి యంగములు పంకజాతములని । యిపులఁ బవిహీనగుణ
మును ధరితపోషుఁ । డనిక దినదూరముగఁ జేసె నాత్మసిత్య। మృదులసుస్నిగ్ధ తా

స్మితవిదితకళలకుం॥ ఉ॥ పట్టుగ నీవధూటికచపాళిభజింపఁగ నీలమేఘమే। గట్టలఁ
జెందునో ముఖము కోరినుతింపఁగఁ బూర్ణచంద్రుఁడే। తట్టునఁ జేరునో మఱియు
దారొప్పనియారుదలంపఁ బాములే। ఘట్టలదూఱునో సమతఁ బూనఁగలేక విచిత్ర
వైఖరిక్రమ॥ సతిపృథుత్వపుహరసీమఁ జన్గవ గిరీశప్రాభవనల్ సేసితా। ద్గతిప్రాపీరచి
నయ్యూర్వశిక్ విషధరాకారంబుఁ దాఁ బూనెనా। రతిపంచాననలీలఁ దాల్చెనడు
మూపాయించుధమ్మిల్లముక్। శితికంఠత్వమునొందనెమ్మొగము గాంచెక్ సోమ
భావంబొగిక్॥ సీ॥ కాఁబోలు నిదియు చొక్కపుసుధాకర రేఖ కాదుఁబో బిషపు శంక
తఁ జెలంగెఁ। గాఁబోలు నిదియ శోకపుదూపుదొరమాయ కాదుబో సఖిరోరఁగ రమ్య
దనరె। గాఁబోలు నిదియు చక్కని వేల్పుపూబోఁడి కాదుబో విభ్రమేక్షణములొద
వెఁ। గాఁబోలు నిదియు దొలకరి తీవియ మెఱుంగు కాదుబో నిశ్చలగతిఁ దనర్చె। నను
చురతిపతిమోహాంబురాశి। మగ్నుఁడై విస్మయాక్రాంతమానసాబ్జుఁడై
సరోజేక్షణా రూపమరసి యరసి। నేర్పు మీఱంగ మఱియు వర్ణింపఁ దొడఁగె. చ॥
కడువడిరాహువేర్చిన వకంజవిలోచనయాస్యచంద్రు నేర్పడ రవహరింపఁగాఁ దొ
డరియ స్మదరాతికరాశియంచు నేర్పడ మదిలోఁ దలంచి మఱి గ్రస్మరి వెన్నునిల్చె
నో యనక్। జడయల రెక్షణాగ్రరుచి చాద్పున రేగడి బిల్లమైఁ దగక్. చ॥ కలకు
ధామమై జలజగర్వమడంచి సుధాప్తి తారకా। కలనఁ జెలంగి తెల్విఁ గని కాముక
పాళికిఁ గుండె గాలమై। యల రెడు భామినీవదనమైందవబింబమనఁగ జెల్లదే। కలయ
గఁగానిచో నచటఁ గల్వలపేరిటి కన్నులొప్పునే. చ॥ కలువలు మీలుఁ దుమ్మెదలు
గాంతకనుంగవకోడియుంచుఁగా। వలసిన కోరికి దీని గెలువందగు వీరుఁడు మారుఁ
డంచుదా। పులుగధ్వజంబుగా గుణము పొందికగానయి వచ్చి దానిభ్రూ। చలనము
తోనఁ దద్ధనువు సంగతిఁ దప్పినఁబోయెనన్నియుక్. క॥ వనితముఖాంబురుహస్థితిఁ
బనిగొని కాముకుల గెలువ భావజుఁ డెలమిం। దనయుభయపార్శ్వములనుం। చిన
చక్రములో యనంగఁ జెవులలరారుక్. శా॥ భ్రూకోదండముఁ బూని దృష్టివిశిఖం
బుల్లోనె సంధించి బాల్రాకాచంద్రునిఁ బట్టి రెండుతునియల్ గావించి తత్సారముం
బోకుండ న్వరించి పార్శ్వములనింపుల్ బంపఁగా నుంచెనో। నాకంజేక్షణ చె
క్కుటద్దములు చెన్నారుం దళుక్కుంచొగక్. చ॥ వరసుమనో విలాసముల వైఖరి
మానితిలోత్తమాఖ్యయా। ధరసుమనోవిలాసములు దద్దయుఁ గాంచె దనం చువ
చ్చియు। ద్ధురగతి నువ్విరమా కులసధోముఖియై తపమాచరించియా। కరివరయా
ననాసయయి గాంచె సమస్తవిశేషవాసనల్. సీ॥ క్షణవిలాసమె కాని సఖియా సెచి
గురాకుసుమనోను రాగవిస్ఫూర్తిఁ గననఁ। బయిచాయ యే గాని పగడంబు సాటి
యేయమృతాకరద్వీపమందు మనసఁ। దీర్పు వన్నెలకాక కెంపుబలు కెంపువగసువ

